# ప్రభాతము



'ప్రౌఢకవి'
అమ్మిశెట్టి లక్ష్మయ్య
'ఉభయభాషాప్రవీణ'

ఓ మామేటిబడేటి మన్నెసరదారా! మా గోదావరి
భూమిరత్నఖనిన్ లభించిన కృపాముక్తామణీ! మాధురీ
సామగ్రీ రచితాంధ్రలోక విజయస్తంభాకృతీ! మత్కృతి
స్వామీ! కైకొనవయ్య మాహృదయపూజల్ నీయశోమూర్తికిన్

గురుగంభీరహృదంతరా! విపుల శృంగోత్తుంగభావా! యశ
స్తరుణీగుప్తమనోవశీకరణ విజ్ఞానస్వరూపా! మనో
హరజాతీయ కళాసుధాతరళ భాండాగార! వీరావనీ
పురుహూతా! యిడనిమ్ము రక్తతిలకమ్మున్ నీయశోమూర్తికిన్.

జాతీయార్ద్రకళాపరిష్కృత సమస్తాంధ్రావనీచేతనా
జ్యోతీ! పావన గౌతమీమధురస స్రోతస్తరంగాయిత
స్వాతంత్ర్యోజ్జ్వల దివ్యహస్తధృత శిక్షాదండ! మత్కావ్యసం
త్రాతా! వేయఁగనిమ్ము రక్తసుమమాలన్ నీయశోమూర్తికిన్.

ప్రతిలేనట్టి విభుత్వమున్ నెఱపి సప్తాంగక్రియాసూత్రముల్
బ్రతుకంజేసిన చాతురీసునిశిత ప్రజ్ఞావతారా! శిరో
ధృతికోటీరము లేని మండలపతీ! యీవీరగంధమ్ము మ
న్నతి శృంగారఁగ భక్తితో నలఁదనిమ్మా నీయశోమూర్తికిన్.

రవిరేఖా కిరణాగ్రమందువలె వక్రత్వమ్ము లేనట్టి సం
స్తవనీయాభినివేశ వాసితచరిత్రా! పంచభూతమ్ము ల
ట్లవనీపాలనలో నపాక్షిక కటాక్షాలోక! యింటింట నీ
యవనిన్ హారతులెత్తనీయఁగదవయ్యా! నీయశోమూర్తికిన్.

# మహారాజపోషకులు

జస్టిస్. పి. వి. రాజమన్నారుగారు,

హైకోర్టు జడ్జి, మద్రాసు.

రావుసాహెబ్ Dr. బి. వి. నారాయణస్వామిగారు,

ఎం. ఎ., పి. హెచ్. డి., బి. కామ్., బార్-ఎట్-లా. ప్రెన్సిపాల్,

పచ్చిఅప్పా కాలేజి, మద్రాసు.

మ-రా-శ్రీ, గ్రంధి వేంకటరెడ్డి నాయఁడుగారు, బి. ఏ. బి. ఎల్;

ఎమ్. ఎల్. ఏ. పశ్చిమగోదావరీజిల్లాబోర్డు ప్రసిడెస్టు

,, 'వాఙ్మయోద్ధారక, కవికులాలంకార' జవ్వాది లక్ష్మయ్యనాయఁడుగారు, జమీన్‌దారు

,, పోలిశెట్టి వేంకటరత్నమునాయఁడుగారు

,, ఎట్రా సూర్యారావునాయఁడుగారు } జమీన్‌దారులు
,, ఎట్రా చంద్రారావునాయఁడుగారు }

,, కట్టా సుబ్బారావునాయఁడుగారు, జమీన్‌దారు

పంచాయతీకోర్టు ప్రెసిడెన్టు, ఏలూరు

,, పసల సూర్యచంద్రరావునాయఁడుగారు

,, గన్నాబత్తుల రంగారావునాయఁడుగారు

,, గంధము వెంకన్ననాయఁడుగారు, బి. ఏ. బి. ఎల్.

,, బడేటి వేంకటరత్నమునాయఁడుగారు,

బి. ఏ. బి. ఎల్; ఫ॥ క్లా॥ పబ్లిక్ ప్రాసిక్యూటర్

,, శానము నాగభూషణరావునాయఁడుగారు

,, గ్రంధి వేంకటరావునాయఁడుగారు

,, ఇట్టింకి నరసింహమూర్తినాయఁడుగారు,

తెలుఁగుపండితులు

,, పరుచూరి వేంకటసుబ్బయ్య చౌదరిగారు,

'ఉభయ భాషాప్రవీణ'

,, శ్రీ అత్తిలి నీరుల్లి వర్తకసంఘము

,, మేకల వీరన్ననాయఁడుగారు
,, కాకర్ల దుర్గయ్యనాయఁడుగారు
,, దిరిశాల నాగన్ననాయఁడుగారు

} మేనేజరులు

# రాజపోషకులు

మ-రా-శ్రీ, గంధము రామారావునాయఁడుగారు

,, ఆడబాల వేంకటరెడ్డిగారి కుమారులు

సత్యనారాయణరావునాయఁడుగారు,

తూ॥ గో॥ జిల్లాబోర్డు మెంబరు

,, మంగిన వేంకట నరసింహారావునాయఁడుగారు,

జమీన్‌దారులు, భట్టిలంక

,, గుద్దటి నరసింహారావునాయఁడుగారు

,, కైగాల సూర్యచంద్రరావునాయఁడుగారు,

ప॥ గో॥ జిల్లాబోర్డుమెంబరు

,, చేగొండి రామదాసునాయఁడుగారు

,, వడ్డి వేంకటస్వామినాయఁడుగారు

,, వట్టి పుల్లయ్యనాయఁడుగారు, ప॥ గో॥ జి॥ మెం॥

,, పుప్పాల రామమూర్తినాయఁడుగారు

# పోషకులు

మ-రా-శ్రీ, చల్లా సత్యనారాయణనాయఁడుగారు

,, చల్లా కృష్ణమూర్తినాయఁడుగారు

,, సంకు పుల్లయ్యనాయఁడుగారు

,, ఎఱ్ఱా శేషయ్యనాయఁడుగారు

,, చెన్నంశెట్టి జగపతిరావునాయఁడుగారు

,, రాగి రాజన్ననాయఁడుగారు

,, చెన్నం కోటయ్యనాయఁడుగారు, గుం॥ జి॥

,, మేకల వెంకయ్యనాయఁడుగారు

,, కట్టా రామయ్యనాయఁడుగారు

,, ఇడుపుల వేంకటకృష్ణారావుగారు

,, పులికొండ రామకోటీశ్వరగుప్తగారు

# అభిమానులు

మ-రా-శ్రీ, రావుసాహెబు వర్ధినీడి చలమయ్యనాయఁడు
గారు

,, ఓసూరి వేంకటస్వామినాయఁడుగారు

,, మంగిన శ్రీనివాసరావునాయఁడుగారు

,, శానం నరసింహారావునాయఁడుగారు

,, వెలిశెట్టి సత్యనారాయణరావునాయఁడుగారు

,, రాయ లక్ష్మయ్యచౌదరిగారు

,, కాప వేంకటసుబ్బయ్యగారు

,, ఎనుముల సుబ్బయ్యనాయఁడుగారు,

పం॥ బో॥ ప్రెసిడెంటు

,, కొండేటి వెంకయ్యగారు

,, తోట రత్తయ్యనాయఁడుగారు

,, ముట్లూరి యువజనసంఘము

,, బడేటి పద్దయ్యగారి కుమారులు

వెంకన్ననాయఁడుగారు

,, పోలవరపు శ్రీరాములుగారు

,, క్రొత్త నరసింహారావునాయఁడుగారు

,, చెన్నం పున్నయ్యనాయఁడుగారు

# చందాదారులు

మ-రా-శ్రీ, గోకేటి బాపిరాజుగారు

,, పసుపులేటి మల్లయ్యగారు

,, నడింపల్లి వెంకయ్య, రంగయ్యగార్లు

,, చెన్నం బాలయ్య, మునగా తిరపతయ్యగార్లు

,, శ్రీరంగరాజభట్టరు శ్రీనివాసబట్టరు అయ్య వార్లంగారు

,, శ్రీరంగరాజభట్టరు శ్రీవత్సచిహ్నభట్టరు అయ్యవార్లంగారు

,, గోపాలం అప్పయ్య, దాళా మల్లయ్యగార్లు

,, ఎనుముల మస్తాన్‌రావు, బొడ్డు భూషయ్యగార్లు

,, కోడే రామయ్యగారు

,, కుంచనపల్లి హనుమంతరావుగారు

,, చాగంటి హనుమారెడ్డి కుమారులు సాంబిరెడ్డి గారు

,, చాగంటి వేంకటరెడ్డి కుమారులు సాంబిరెడ్డిగారు

,, ఆత్మకూరి రామారావుగారు

# సమీక్ష

## వస్తువు

“రససిద్ధాః కవయః”

కవి రసావేశావస్థయందే కావ్యసృష్టి చేయును. ప్రకృతియందలి గభీరమగు సౌందర్యరసానుభూతియొక్క రహస్యము సీమాబద్ధమై మఱుఁగుపడి యుండును. ఈ విచిత్రరససౌందర్యలహరిని మానవదృక్పథమున నృత్య మొనరింపఁజేయు పనియే కవికల్పనయందలి వస్తువు.

ఆంధ్రదేశీయ ప్రసిద్ధచారిత్రములోని సత్యసౌందర్యములు సడలని కవికల్పనామిళితవస్తువే నేఁ డీ కావ్యమునం దాపని నిర్వహించినది.

## రసము

విశ్వవిదితమగు సత్యమును - సార్థకతను - సౌందర్యమును - మాధుర్యమును - సౌభాగ్యమును - కళాస్వరూపమును వ్యక్తీకరించుటయే రససృష్టి.

విజాతీయ శమస్థాయికాంగకముల కక్లిష్టమై యపరిక్షితమై వీరరస మీకావ్యమందు రత్యంగమగు ప్రణయముచే నుజ్జీవించి కావ్యత్వము సంపాదించు ప్రధానరసమై తన వ్యక్తిత్వమును రససృష్టిలో నిలిపికొన్నది.

## కా వ్య జ గ త్తు

కళాశీలియగు కవికిఁ గళానుకరణమువలననే సౌంద ర్యానురక్తిమయు - రసపిపాసయుఁ బరిణతి నొందుచుండును. సృష్టికిఁ బరమగు (మూలమగు) ఏ సృజనాశక్తి - ఏ యఖం డానంద కళావిలాస మీశ్వరుని విశ్వరూపునిగఁ - గళామయు నిగ నొనర్చెనో ఆ సృజనాశక్తియే - ఆ యానందరసమే - ఆ కళావిలాసమే కళాశీలియగు కవిపట్లఁ గావ్యజగత్తునందుఁ బరిపూర్తి నొందుచున్నది.

ఉమాచోళులు, విజయాసోమదేవులు, రాజరాజవిజ యాదిత్యాదు లీ కావ్యసృజనాశక్తిలో నిలిచి ప్రేమయు - దాని ప్రతిద్వంద్వి నిష్ప్రేమయుఁ బొందిన యవస్థాభేదముల కన్నింటికిఁ బర్యవసానఫలమును దేల్చి యీ కావ్య మొక జగత్తని నిరూపించి దానికిఁ బరిపూర్తినొసంగి యీపని నిర్వ హించిరి.

## క ళా ప్ర యో జ న ము

కళామయుఁడగు నీశ్వరుని యనంతవిలాసమగు ప్రకృతి రచనయందుఁ బరిపూర్ణతను బొందినప్పుడే, సృష్టిరచనా రహ స్యము బుద్ధిగోచరమయి కళాప్రయోజనము సుబోధక మగును.

సహజకవిముఖవినిస్సృతమగు - నిజమగు కవితాస్ర వంతియందు విశ్వకవితాలహరి ప్రద్యోతకమయి, సౌందర్యా త్మను - ఆనందనృత్య మొనర్పఁజేయును. అపుడే కావ్యసం

దేశమధులహరి సౌందర్యాత్మలో స్ఫురితమై శాశ్వతమై నిలుచును.

స్వదేశభక్తి
స్వజాతిరక్తి
స్వమతదీక్ష
ఆర్తసంసేవనము (విజయాచోళదేవులు)
వీరమువలనఁ బ్రణయారాధనము (ఉమాచోళదేవులు)
ప్రణయమువలనఁ బ్రణయారాధనము
(విజయాసోమదేవులు)

వీరమువలన వీరారాధనము (ఉమావిజయాదిత్యులు) మొదలగునవి - మనుజజాతి కవశ్యములగు సందేశము లీ కావ్యమున జాలుగొన్నవి.

## సౌందర్యవస్తువు

కవిజిహ్వ - కవిహృదయము - కవీంద్రునాత్మ యెంత సౌందర్యోపేతములయిన - ఈశ్వరగాన మంత ఆ కవిసృష్టి యందుఁ బ్రస్ఫుటితమగును. కవి కెంత సౌందర్యరూపతృష్ణ యున్నను, ప్రతిరూపసౌందర్యము నాతనినాకర్షించి రచన నొనరింపఁజేయఁజాలదు. రూపసౌందర్యముతోఁ జేరి ఆత్మ సౌందర్యము నలరించుకొన్నరూపమే కవితాసృష్టికిఁ దగు వస్తువు కాఁగలదు. అట్టి సౌందర్యవస్తువునే మనప్రౌఢకవి తన కావ్యసృష్టికిఁ జేచిక్కించుకొన్నాఁడు.

విజయాప్రణయకథనములో, సేనానియాక్రోశకథనములో, ఋషివరునకుఁజేసిన యుమావీరప్రబోధములో వక్ర

సంకలితమైన యీ కావ్యకథాసంవిధానములో సౌందర్యము రూపముధరించి యీ కావ్యవస్తువునకు స్థాయిత్వ మొసఁగినది.

## కావ్యనాయకుఁడు - కావ్యపతి

ఊహాపూరితమయిన యుత్కృష్టాత్మసౌందర్యసంస్కారసృష్టిలో నిష్కామానుభవానందరసానుభూతిని రేకెత్తించి కాంతిఘోయుతమగు సృష్టిపరిణామమును నిర్ధరించి శాశ్వతత్వమును బ్రతిష్ఠించుకొనఁగల మూర్తిమంతులు నాఁడై, నేఁడు యశోమూర్తిమంతులైన స్వార్థత్యాగమూర్తులీ కావ్యోత్తమనాయకుఁడు చోళుఁడు, కావ్యపతియగు బడేటియు.

కాలగర్భములో లీనమయిన యీ యుదాత్త నాయకులిరువురు కళారంగమున నీ కావ్యకథాజవనికపై నొకరు అత్యుక్తిలేని కృతిసమర్పణయవనికపై నొకరు కవిచే నెక్కింపఁబడి శాశ్వతులయి కవిని శాశ్వతపఱచినారు.

## కళాసృష్టి ఆత్మదత్తమగు బహ్యాకృతికి నుపకృతి

ఇయ్యది కవియొక్క యపూర్వసృష్టి. కేవలభావాత్మకము. ఊహాలలో ననుభవింపవలసిన మధురరసముల ప్రోవులు.

ఆత్మదత్తమగు బహ్యాకృతి ఆత్మచేఁ బరిగృహీతమగు నప్పుడు కళాసౌందర్య ముల్లేఖితమగును. అట్టి సౌందర్యరసానుభూతిచే ఆత్మ కేంద్రీకరింపఁబడి సౌందర్యనటన మొనర్చి ప్రకృతిని సౌందర్యప్లావిత మొనర్పఁజేయును. అట్టి హ్యబకృతికి నుపకృతియే యీ ప్రౌఢరచన.

ఔచితికి వన్నెలద్దుకొన్న కావ్యప్రధానపాత్రల నిర్వహణములో అందును విజయాపాత్రనిర్వహణములో ఆత్మ కేంద్రీకృతమై యీ ప్రౌఢరచనాసౌందర్యమునకుఁ బ్రేఁకత్వ మవధరించినది.

## కళాప్రదర్శనము

కళాపిపాసి ఆశించునది - ఆశింపఁదగినది - ఆశింపవలసినది మధురమగు ప్రౌఢభావముయొక్క సృష్టి. అట్టి ప్రౌఢత మృగ్యమగుచోటుల రసానుభుతి - రసస్పృష్టి కుంటువడి తావులు నడలును.

ప్రౌఢనర్తన మొనర్పని కవిత కాని-నర్తకి కాని - శిల్పము కాని పరిపూర్ణసౌందర్యదశ నొందఁజాలదు. ప్రౌఢత లేని ఏ కళాప్రదర్శనము - ఏ రూపసౌందర్యము, ఆత్మను రేకెత్తించి ఆనందపుటంచులఁ (పారములఁ) జూరఁగొనఁజేయఁజాలదు.

కావ్యాదినుండి కావ్యముతుదిసోకువరకుఁ బ్రౌఢనర్తనతోఁ గదనుద్రొక్కిన యీ కవిసిద్ధహస్తములోని లేఖిని దీని కుపమానము. విజయావిజయఘట్టము, ఋషిప్రబోధ ఘట్టము దీని కుద్దిష్టములు.

## ప్రభాతము

ఈ తెలఁగా తెలుఁగుకవిప్రౌఢ సౌందర్యప్రకృతిజనిత రసగాన తరంగోదిత ప్రభాతము - తెలుఁగు మాగాణుల మొలకలెత్తి - పెరిగి - శతాధికశాఖాసమన్వితములయి,

శోభలీను రసజ్ఞకుమారరసాలతరువుల నవ్యోన్మిషితములగు చివురుగుములగూండ్లు కట్టికొని సుప్తినున్న కళాపిపాసాపూరిత కళారాధకపికసముదయముల మేల్కొల్పి ప్రకృతిరహస్య మధువునఁ బుల్కరింపఁజేయుచు ఆనందగాన మొనర్చుకొమ్మన్నది. లలితశబ్దావిష్కృతములగు ఈ కవిదీర్ఘసమాసములు చాల ప్రౌఢములు. ఇందలి భావసుధాతరంగములు కరుడులు కట్టి మార్దవచిక్కణములైన మధుకణములను బరశ్నతాధికముగఁ బంచుచున్నవి.

ఈ కావ్యకథావ్యక్తు లెల్లరు బహుళకష్టముల ననుభవించి ఆయనుభూతిలో జనితమైన సత్యసౌందర్య సౌఖ్య లహరిలో నోలలాడిరి.

'బహుళవిపదంధకార ప్రభాతమయ్యె
నేఁటికాలోకబాంధవనృపులకు'

అని కావ్యకర్తయే భరతవాక్యము ప్రజలనోటఁ బలికించినాఁడు. ఇది సముచితస్థానమును గడించినది.

## కిరణసమీక్ష

కావ్యపఠనమువలన రేకెత్తిన రసావేశ సంజనిత హృద్వేగమె యీ సమీక్ష.

దైవికమగు మఱువరాని మాప్రౌఢస్నేహబంధమున నదనయిన సౌహార్ద హృదయాంతరాళములనుండి యేదో సౌందర్యకళిక జాలువారున నెడి కోటిసూర్య కాంతుల నిరీక్షణమునకె యీ నా సమీక్ష.

## మానవాతీతసృష్టి కావ్యరచనకుఁ బుష్టి

సౌందర్యప్రతిమనుగాని సౌందర్యహృదయమును గాని సౌందర్యప్రకృతిని గాని సృష్టించుపని బహుకష్టము. వానిని భగ్నమొనర్చుపని మాత్రము సులభము.

భగ్నమొనర్చు ప్రకృతి పశుత్వము. సృష్టి నొనర్చు ప్రకృతి మానవత్వము. సృష్టినొనర్చి నిష్కామానందముఁ బొంది సర్వ ప్రకృతిని అట్టి ఆనందముచే ప్లావితమొనర్పఁ జేయు ప్రకృతి మానవాతీతత్వము.

ఉదాత్తమగు మానవ మధురగుణకల్పనము కావ్య కథావ్యక్తులలో నిలిచి లోకమున కాదర్శకమగునపుడే మానవాతీతసృష్టి యనిపించుకొనును. అది ఈ కావ్యవ్యక్తులయెడఁ బరాకాష్ఠతో మిళితమై కావ్యరచనకుఁ బుష్టిచేకూర్చినది.

### అభినందనము

పైని నుడివినట్టి మానవాతీతవ్యక్తులనే యీ కావ్య రచనకు సంపదగాఁగూర్చి సౌందర్యరసానుభూతిని వెదఁజల్లిన యీ ప్రౌఢకవికి నా నమస్సులు.

పసల సూర్యచంద్రరావు,

తాడేపల్లిగూడెము.

# కావ్యతత్త్వము

తెలుఁగువీణ పసందు దిద్దీ
తెలుఁగుకత్తి మెఱుంగుతీర్చి
తెలుఁగుపూవుల
దేనె నించిన
దివ్యలే మాకులస్వాములు,
తెలుఁగుతనమే
నాకు నిత్యమురా!
నాపైతృకమ్మగు
తెలుఁగుపొలమే
స్వర్గరాజ్యమురా! అనే

తీవ్రభావ పరిణామమే అమ్మిశెట్టివారి కావ్యకళాజీవం.

తెలుఁగుగడ్డను పుట్టినందుకు తెనుఁగుకైతలు నేర్చినందుకు, తెలుఁగుశౌర్యజ్వాల నూది ప్రజ్వలింపఁజేయుటకే మా మిత్రుఁడు తన తెనుఁగు కావ్యక్షేత్రములో ప్రభాత గీతాల నుద్రిక్తుఁడై ఆలపించడం జరిగింది.

ఏది వ్రాసినా - ఏది పాడినా - ఏది చూచినా - తీయని తెల్గుబ్రతుకుపసందులు లేనిది ఈ యమ్మిశెట్టి కవి గుండెను హత్తుకోదు.

సిసలైన తెలుఁగుపదాలంటే ప్రాణం - తెలుఁగునాటి కథలంటే తీపి. తెలుఁగుజాతి ముందడుగు వేసిందంటే రాచ

రికము తనదే అన్నంత ఉద్వేగం ఉత్సాహం నైసర్గిక గుణా లీ తెలుఁగుబిడ్డనికి.

ఇంతవరకు ఈయన వ్రాసిన కావ్యాలన్నీ తెలుఁగుజాతి చరిత్రకు సంబంధించిన కథలే.

వీరి ప్రభాతం - చంద్రగిరిదుర్గం - చదివితే పదునులు దేరిన లేఖిని బాకై నిద్రాణమైయున్న తెలుఁగుజాతి శౌర్యాన్ని ఉజ్జీవింపఁజేయగలదని తీరుతుంది.

"తేనియ కండచక్కెరచవుల్ దేలించు తెలుఁగు నా బాస - "పులిమీసల్వట్టి యుయ్యాలలూపంగల దిట్టలు" నా వారు - "పైడిమొహరీలు బస్తాలబట్టి" యెత్తునదే నా తెన్గు బజారు - "పండ్లు పులిసిన జాళువాపసిఁడిగనులు" గలదే నా తెనుఁగునేల అనే యుద్రిక్తభావాలు గల ఈ కవిగుండెలో గర్వం ఎవరెస్టుశిఖరాన్ని మించిందంటే అబ్బురం ఉంటుందా?

అజ్ఞాతయుగానికి సంబంధించిన తెలుఁగుజాతిచరిత్ర విడిచి ఆంధ్రప్రాభాత మనందగిన రాజరాజయుగ చారిత్రమే ఈ కావ్యవస్తువు.

రాజరాజు నాటికే కాలమూర్తిచే కబళింపబడ్డ ఆంధ్ర సామ్రాజ్యాలు కూలినకోటలు - వ్రాలిన కీర్తులు - ఉన్నట్లు చిత్రిస్తూ "చితికిన పాలరాతినగిషీ శకలమ్ములు చాకిరేవులం దుతికెడి మైల బండలయి" యున్ననాఁడూరకొన్న తెలుఁగు జాతి "యపప్రథాగతికుపాధి" యగు రాజత్వాన్ని గర్హించీ -

"ఉడుకెత్తిన నెత్తురులోని మంటలన్ విషమశిలీముఖమ్ములకు విందొనరించి" - "తృషిత తెనుఁగుజీవముల తేర్పుటకై" - "కదనతాండవమాడక తెన్గునెత్తుటన్ బెరిగిన కర్ణరుండెనఁదు వేఁడువహింప" గలండని గర్జించి - "జన్మభూమికిన్ గత్తుల కోట కట్టి" "నెత్తురగడ్తనింపి" "తెనుఁగు బావుటా నెత్తి మహోత్సవము" జరిపించుటకు జాతినుద్రేకపఱచుటకు కళాతాండవం చేసింది కవిలేఖిని ఈనాటి ప్రభాతంలో.

"పారతంత్ర్యమ్ము తెలుఁగులపాల" బడినా - "తెలుఁగు సింగమ్ము లినుపబోనులను స్రుక్కి"నా - అవియె నా హృదయవ్రణమ్మని కవి హృదయం కంపించిన ఘట్టం ఉజ్జ్వల కళాలలితం.

ఈ కథ రాజ్మహేంద్ర సింహాసనమునకు సంబంధించినది. రాజ్యకాంక్షచే విజయాదిత్యుఁడు అన్నకుమారుఁడగు కుళోత్తుంగచోళుని వంచించి రాజ్యమాక్రమించుటయు తిరిగి కుళోత్తుంగచోళుఁడు రాజగుటయు వర్ణితము. కథానాయిక ఉమ.

కుళోత్తుంగచోళుఁడు, విజయాదిత్యుఁడు మాత్రమే చారిత్రకపురుషులు. మిగిలినవి కవి కల్పితపాత్రలు.

ఐశ్వర్యకాంక్షా-అధికారకాంక్షా ప్రేమభావాల నంతరింపఁజేసి కసాయితనం తెచ్చినా - ధర్మవీరులగు కుళోత్తుంగ

సోమదేవులు ప్రమోల పశ్చాత్తప్తహృదయుఁడైన విజయాది త్యునిచే "రాజ్యాశల్ ... ... మనోనయన మాయాదర్పణాం తర్నిధుల్" అని తీర్పు దిద్దించిన కావ్యసృష్టి ఫలశ్రుతి నందినది.

ఆనాటి స్త్రీలు రణోద్యోగినులై రాజ్యాలేలిన రసవత్తర ఘట్టాలు చదివిన నేటి తెలుంగు టిల్లాలిగుండె శౌర్యరసో జ్జ్వలమై తీరుతుంది.

ఈ ప్రభాతకృతి పడమటి గోదావరీమండల తెలఁగా కులంపు ధీరనాయకుఁడై కీర్తిలిన బడేటి వేంకటరామయ్యా నాయుని యశశ్శరీరాని కంకితం.

"తెలఁగా జోదుల కండనెత్తురుల జ్యోతిఃపుంజముల్ లేచి దిగ్వలయంబుల్ గ్రసియించు" ఆనాటికీ నేటికీ సాదృశ్యం చూపిస్తో కృతి రచించి సమర్పించిన కృతికర్త ధన్యుడు.

తురగా వేంకటరామయ్యా.

శారదాపీఠముయొక్క

# అభివందనములు

రాంబోవు శారదాపీఠము కృతులకు వాగ్దాన మొసంగిన

మ-రా-శ్రీ, ముళ్లపూడి తిమ్మరాజు జమీందారుగారికి

మ-రా-శ్రీ, పసల సూర్యచంద్రరావు నాయండుగారికి

మ-రా-శ్రీ, మద్దాల రామకృష్ణారావు నాయండుగారికి

మా సంస్థాన పోషకవర్గమునకు

# ప్రభాతము

## కృతిసమర్పణము

### శిలావిగ్రహమహోత్సవవేళ

భయదమహా దాస్యసర్పమ్ము కాటందిమూ
ర్ఛంగొన్న ప్రజకు మంత్రౌషధమ్ము
రక్తనాళములు చల్లారి జీవము లేని
నగలోకమునకుఁ బ్రాణప్రతిష్ఠ
ఇహలోకయాత్ర ముగించి పైనున్న పూ
జ్యాళికై యిడిన యాహ్వానలేఖ
తమకై గతించు స్వార్థత్యాగులకుఁ బ్రజల్
కట్టిన స్మృత్యంకఘనపతాక
అన్నమును నీళ్లు మాని సత్యానుభూతిఁ
దాము మృతజీవు లవని కాదర్శకముగ
ననిశ ముపదేశ మిడు నుపన్యాసవేది
అది శిలావిగ్రహోత్సవ మైనవేళ.

## ప్ర భా త ము

ఎంతటిదిలాస మది గిలిగింతపెట్టు
నంతటి పురాస్మృతి యెడంద నంటఁగోయు
ఎంత దుఃఖాగ్నికీల దహించు నందు
నంతయానందలహరి ప్రస్యంద మందు.

అపరంజిముద్దగా నాంధ్రదేశ మ్మెల్ల
    మార్చినచాళుక్యమనుజవిభుని
నమృతస్రవంతిగా నఖిలాంధ్రభాగమ్ము
    తీర్చిన శ్రీకాకతీయవిభుని
రతనాలశాలగాఁ ద్రైలింగ మెల్లఁ బా
    లనగొన్న శ్రీకృష్ణరాయవిభుని
త్రిభువనజ్యోతిగాఁ దెలుఁగుమాగాణ మే
    ల్బడిఁగొన్న రఘునాథరాయవిభుని

దలఁచికొన్నప్డె యెంత మదంతరమ్ము
పెరిఁగి విఱుగునో యంతగాఁ బెరిఁగి విఱుగుఁ
దలఁచికొన్నంత సత్కృపాకలితు శ్రీబ
డేటి వేంకటరామయ్యమేటివిభుని.

అగ్రసరప్రభావుఁ డగు
    నాతనికిన్ స్మృతిచిహ్నమౌ శిలా
విగ్రహ మెత్తి లోకము వి
    వేకధన మ్మొసయుక్తిఁ గూర్చెఁ, ద

త్త్వగ్రహణప్రవీణ మగు
    ధార్మికలోకమునందు నిగ్రహా
నుగ్రహదక్షు లందుకె మ
    నుష్యులుగా జనియింత్రుకావలెన్.

అతఁడు మనుష్యుఁడటయ్యా సురాలయ
    మందుండి దిగిన మహర్షి కాని
ఆతఁడు నరమాత్రుఁ డౌనన వచ్చునా
    యిలకు డిగ్గిన దైవకళయె కాని
అతఁ డేడ యీ మనుష్యత్వసిద్ధి యి దేడ
    హస్తికి దోమ కున్నంత తేడ
అతనిలో ఈ విశ్వవితత విజ్ఞానమ్ము
    ప్రోవుగాఁ బోసిన పోల్కిఁ దోఁచు

బట్టుదల కాతనిం జెప్పి పరుల నెన్ను
టన్నది తులకు సరిపడనట్టి మాట
అతని స్మృత్యంకములు శిలాప్రతిమ లెన్ని
లేచునో ఈ విషాదత్రిలింగభూమి.

అతఁ డొక పేదకాపుగృహ
    మందు జనించి భవిష్య దున్నత
స్థితిఁ గ్రమియించు లక్షణవి
    శేషము లాతని పూవ ప్రాయమం

దలికిన రీతి, భావిచరిత్రఁ
        సకలాంధ్రము నేలు శక్తిసం
పాతులను గ్రుచ్చి మేల్మెఱుఁగు
        లద్దెడిరీతి గ్రహించె విద్యలన్.

సౌశీల్య విపుల తేజశ్శిఖల్ నయనాల
        వెలయ నత్తిలి బాల్యవిద్యఁ గఱచె
ట్యూషన్సు చెప్పి కష్టోపార్జితమున ధీ
        విభవుఁ డై యున్నతవిద్య నేర్చెఁ
బ్రతికత్యలో నగ్రబహుమానములు పొంది
        ప్రజ్ఞావిధిఁ బట్టభద్రుఁ డయ్యె
బడిపంతులై డబ్బు గడియించి బారులోఁ
        బ్రతిలేని ప్లీడింగులాయ రయ్యెఁ
గఱకునేలలు చాపలే పఱుపులంట
మ్యునిసిపలులాంతరులె కళాబోధదీప
గణములఁట విద్య గడియించు కాలమందు
నింతయున్నతి కెంత కష్టించె నతఁడు.

బ్రౌసెన్ దిగ్జయభేరి యుద్ధవిడి
        లాలోఁ, గీర్తికాంతిచ్ఛటల్
రాసక్రీడ లొనర్చె నల్గడల జి
        ల్లాలో, బడేటిప్రభున్

## కృతిసమర్పణము

దాసోహమ్మనెఁ జైర్మనున్నత
పదాధ్యక్షాధికారమ్ము, వి
ద్యాసంపన్న మనోజ్ఞమూర్తులకు
వశ్యమ్మేమి కాకుండెడిన్.

ఏవేళ ముట్టిన నెచ్చోటఁ దట్టిన
జలయంత్రములు స్వాదుజలము లూరె
నేయింట నడుగిడ్డ నే సందు కన్పడ్డఁ
బారిశుద్ధ్యప్రభల్ పరిఢవిల్లెఁ
నేరేయిఁ గనుఁగొన్న నేప్రక్క మనుకొన్న
విద్యున్మణీదీపవితతి వెలసె
నేవేళ నేగిన నేవీధి సాగినఁ
బురవీధు లద్దాల మురువు లొలసె

నతఁడు హేలాపురీ పాలనాధినేతృ
పదమునందున్న పదియేండ్ల పాటికాల
మిర్విపై స్వర్గమం దుండి యూడిపడ్డ
తుంపువలె సొంపు మిగిలి తత్పురము మెఱసె.

తాను బడిపంతులై మహోదారచరితుఁ
డగుట కేస్కూలు కారణమయ్యె నట్టి
మిషనుహైస్కూలు మ్యునిసిపల్మేరఁ జేర్చి
ప్రోచెను గళావదాన్యతామూర్తి యతఁడు.

ప్రభాతము

పోటీ తన కెచ్చోట్లను
బాటిల్లకపోయె, నపుడు 'పబ్లిక్ప్యాసి
క్ఫ్యాటర్షి, ప్పాతనివా
గ్ధాటికిఁ గడుపుల్కరించి కై వసమయ్యెన్.

మురిసిరి రాజకీయపద
ముఖ్యావతంసులు, పూలదోయిళులఁ
గురిసిరి జాతివారు, రస
గుంఫిత మై సకలాంధ్రదేశమే
కరఁగిన, దింటనింటఁ దన
కావ్యకథల్ చెవియొగ్గి భక్తితోఁ
గఱచిన దిచ్చుకొన్నయది
గౌతమి మాండలికాధిపత్యమున్.

ఇల కొక తీర్థమే యపుడు
స్పష్టము కాఁబడినట్లు తాను మం
డలపతి యైన రోజున జ
డమ్ములు సైతము జీవరేణువుల్
గలిగి వెలింగె మండల మ
ఖండముద మ్మొలసెన్ గుమంగుమల్
మొలచె సుగంధవస్తుపరి
పూర్ణసువర్ణజలాభిషేకతన్.

కలికి తెలుంగుతోఁటఁ దెలఁగా
        యెలమావుల నిల్చి తీయనౌ
తలఁపుఁజివుళ్లు మేసి యమృ
        త మ్మొలయించురవమ్ము నెత్తుచున్
గలకలఁ గూసెఁగా దొరత
        నమ్మను నామనివేళలోన మేల్
చిలుకుపసందు పాటలను
        జేర్చి బడేటిపికమ్ము గుమ్మగన్.

కనులలోఁ గెంజాయ తోఁచకుండే యెఱుఁగని
        మీ కిదే మానమోవాకమయ్య
కలహసూచక మైన పలుకె లేనట్టి మీ
        యమలమూర్తికి మాజోహారులయ్య
యుపకారబుద్ధికే నెపములు వెదకు మీ
        ప్రకృతికి మాధన్యవాదమయ్య
పొట్టపై దెబ్బనుం గొట్టుటే లేని మీ
        మధురమూర్తికి మానమస్సులయ్య

అనుచు నూరూరు రావించి యాత్మ మెచ్చి
ప్రతిపదమ్మందునన్ బ్రహ్మరథము పట్టి
స్వాగత మ్మిచ్చు గౌతమీప్రజలహృదుల
నిమిడి మూఁడేండ్లు బోర్డు పాలించె నతఁడు.

ప్రభాతము

ఓ యన నో యటంచుఁ బ్రజ
కూఁతగొల్పు తదీయసేవకుల్
దీయనిడెందమై కరఁగెఁ
దెల్గు పడంతుక, వానిపట్టునన్
'వేయికిఁ జాలుఁబో తెలుఁగు
వీరుఁ డొకం డనుపల్కు నెల్లెడ, ఈ
హాయి నకాలమృత్యువక
టా! సహియింపఁగ లేకపోయెఁగా.

ఒక నక్షత్రము వెల్గివెల్గి తన
దివ్యోదారకాంతుల్ దిశా
ప్రకరమ్ముల్ వలయమ్ముఁ జుట్టుకొన
నీలాకాశమందుండి మేల్
వికచన్మంజులమల్లికాసుమము
వల్లీవృంతముల్ బాయుపో
లిక నేదో గ్రహమండలభ్రమణ
సంఘృష్టాత్మయై రాలెఁబో.

సూర్యాచంద్రమసుల్ కలంగిరి
కళాజ్యోతుల్ దిగంతమ్ములన్
నిర్యాణించెను భూనభోన్తరములన్
భేదించెఁ దామిస్రముల్

## కృతిసమర్పణము

కార్యస్థానికచక్రపాలనము
చీకాకయ్యె మేల్వారిలోన్
ధైర్యశ్రీ సడలెన్ మఱిన్ గువల
యానందమ్ములున్ రూపఱెన్.

తనివెంగా తనజాతి తారకాసంతాన
కామితార్థమ్ము చింతామణి యయి
మనివెంగా తనకళామహితదానమున నా
నామర్త్యకోటులన్ సోముఁడట్లు
నడివెంగా బోర్డు పాంథానాథు లలర ముం
దఱివారలకు మార్గదర్శి యగుచుఁ
దలఁచెంగా భువి సదా తా నొక్క ధ్రువతార
వలె లోకసేవకై నిలుతు ననుచు
ఆ మహాజ్యోతి నక్షత్ర మక్కటకట!
రాలిపోయిన దే లోకరాజ్యసీమ
నిలిచి వెలుఁగునో మామనోనేత్రపటిమ
తగ్గినది దుఃఖబాష్పాంబుధార లెనసి.

ఈపగిదిన్ బ్రసంగముప
యిన్ మఱియొక్క ప్రసంగ మందికొం
చూపిరి సల్పనంత జన
ముద్ధవిడిన్ జనుదేర, నాఁడు హా

లాపురిలో బడేటిది శిలా
    ప్రతిమల్ ప్రతివీథిఁ బుష్పమా
లాపరిబద్ధఁ జేసి మధు
    రమ్ముగ నుత్సవ మెత్తి రెంతయున్.

ఇతఁ డఁటే యహింసాప్రమృతమాతచనుబాల
    నాని శాసన సభ్యుఁ డైనమేటి
వీఁడఁటే వీథిదివ్వెలచెంతఁ జదివి జి
    ల్లాబోర్డుకుల్ ప్రభుఁ డౌ బడేటి
ఇతఁడఁటో పార్టీకి నిడి ప్రాణ, మేగాని
    తనకునై మిగిలించికొననిమేటి
వీఁడఁటో శ్రీదేవితోడ వాగ్దేవిఁ బో
    రించి యేడేండ్లు గెల్చిన బడేటి

ఎంతలో వచ్చెనమ్మ యీ బుద్ధమూర్తి
కొడుదుడుకుమిత్తి యని సుగంధోదకముల
వారఁబోసి పూదండలు వైచి యింట
నింటఁ గప్రంపుటారతు లింతు లిడిరి.

ఆ విధిగాఁ దరంగితమహామ్ము
    నభమ్మును దాక మంగళ
శ్రీ వివిధధ్వనిప్రచుర
    సేవధి యై పుర మొప్ప నల్గడల్

బూవులజల్లు రేఁగ స్మృతి
మూర్తికి బ్రహ్మరథమ్ము పట్టి త
త్కోవిదువిగ్రహమ్ము నెల
కొల్పినవారు బడేటిపార్కునన్.

కొందఱు భక్తు లైనారు కొంతమంది
మత్తుగొన్నారు కొంద ఱాపత్తుమీఁద
నాపదం బడ్డయట్టు లాస్యములు వంచి
రింక నొకకొంద ఱిట్లు భాషించుకొనిరి.

ఉన్నదా యెన్నడే నోటమి? గురువాట
లొంగెఁగాని బడేటి టంగుటూరి
కెఱుఁగరా యేటేట గురుపాదపూజ కా
తఁడు వేనకునువేలు దాన మిడుట
కా దందురా యెల్ల కాంగ్రెసుపెద్దలు
గురువు తనస్మృతికి గగ్గోలుపడుట
ఒప్పికోరా తన్మహోజ్జ్వలబుద్ధికిఁ
స్వపరపక్షములు విభ్రాంతిపడుట

అతఁ డసామాన్యుఁ డేనాఁటి వితతపుణ్య
ఫలముచేతనో తెలుఁగుభూభాగ మతని
కన్న దాయమ్మకుక్షిలో కరిగెఁ దిరిగి
మఱలఁ గనుగోము తన్మూర్తిఁ గుఱుతుఁ దక్క.

సూర్యుం డేరాజ్యసీమం దత్కార్యములకు
సాక్షియ ట్లస్తమింపండో యట్టిరాజ్య
గురుపతాక మద్రాసుహైకోర్టుమీందం
దింపంబడ్డది నాండు క్రిందికి సగమ్ము.

దొరతనమందు నున్నతప
దోజ్జ్వలులై యదు గుర్వి మోపుచే
యెఱుంగనివార లక్షుల స్ర
వించెడునశ్రులం జేరుమాళ్లం బో
నెఱపుచు నీలిదుస్తులను
నిండుగం దాలిచి శోకదేవతల్
పురినడివీధి నేగినటు
పోయిరి తన్మృతమూర్తిం గన్గొనన్.

పేరుగాంచిన యిరువాగుపెద్ద లెల్ల
దద్దరిలిరి మద్రాసుమద్రాసు సొంత
ముడికిపోయెను భావిభాగ్యోదయమ్ము
జాఱిన శ్లేడ్చె నాంధ్రరాష్ట్రమ్మె నాండు.

ఎంతటిపెద్దవాం డెంతలో మన మెల్ల
వీక్షించుచుండ నదృశ్యుండయ్యె
నితండె యింకొకకొన్ని యేండ్లైన మనియున్న
నెంతదీప్తిని నాంధ్రు లెనసియుంద్రొ

ఇతనిమృత్యువు తెన్గుపృథ్వికి సూచించు
    నొకయరిష్టమ్ము రానున్నపగిది
ననుకొన్నపనికి ముం దగ్నికుండమె యున్న
    వెనుకంజ వేయుటే కని యెఱుంగఁ
డనుచు గుంపులు గుంపులై యరుగుదెంచి
శిరములను వంచి మ్రొక్కిరి శ్రీబడేటి
వంశ్యు వేంకటరామయ్యబాహ్యదేహ
మెనసియుండినశవపేటి కెల్లజనము.

త్రొక్కుకోరా నాఁడు త్రోపాడి మృతశవ
    పేటిమోయఁగఁ దెల్గుపెద్ద లెల్లఁ
బెనఁగలేదా ముట్టికొనినఁ దత్తను
    వాత్మజని ఫలించు నటంచుఁ దెనుఁగుజనము
నెట్టికోరా నేను నే నని మునికాళ్ల
    లేచి తన్మూర్తి దర్శించుకొఱకు
మోయలేదా జాతిపోవునెడఁ బైకిఁ
    ద్రోసి ధన్యతఁ గన్నదాంధ్రజగము

బ్రదికి బ్రహ్మరథము పట్టించుకొన్నాఁడు
చచ్చిపోయికూడ జగముచేత
బ్రహ్మరథము నేఁడు పట్టించుకొనుచుండె
నింతకన్న సుకృతి యెవఁడు గలఁడు?

అనుచు మద్రాసులోని తద స్తమయపుఁ
గథను గంపెడుదుఃఖమ్ము గడలుకొనఁగఁ
జెప్పికొని చెప్పికొని కంటిచెలమ లూర
ఆశిలావిగ్రహామువంక నరసి వారు.

ఆనాఁడు జాల్గొన్న యీ నేత్రజలధార
లాఁగ వేడంబుధుల్ పాఱుకరణి
ఆరోజువాఁచిన యీరక్తవదనముల్
విరమింప వుదయార్కబింబవిధిని
ఆవేళరాఁజిన యీవిషాదహృదగ్ని
యాఱదు విలయకాలాగ్నిపగిది
ఆపూఁటఁ బైకొన్న యీపూర్ణ నరకంప
ముడుగదు పెనుతుపా నూఁపినట్లు
తెనుఁగుజగతికిఁ బిడుగుపా టెనయుపోల్కి
మాఁబడేటికి మిత్తి సంప్రాప్తమయ్యె
ఆంధ్రలోకమ్ము తలఁప నేఁ డంధలోక
మయ్యెను బడేటిమార్తాండుఁ డస్తమింప.

అతఁడు రాయలో లేక యతనిప్రెగ్గడ తిమ్మ
రుసో వారియైక్యమో అసలుసిసలు
అతఁడు లాయరో లేక యందున్న లాయొ జి
ల్లాయెల్ల నేఁడు తార్కాణ దీని

## కృతి సమర్పణము

కతఁడు పాలకుఁడో లేకందలిపాలిత
వ్యక్తియో బోర్డునేల్బడియె సాక్షి
అతఁడు జిల్లాకోర్టో యందున్న రూలొ త
న్నిర్భయవాక్యైపుణియె నిదాన
మాతఁడుపకార మొనరించునట్టిపట్ల
అడ్డినప్రభుత్వఘనశాసనాళి నెల్లఁ
దనకు ననుకూలముగ మార్చుకొనుటె కొలత
యాతని యనంతకరుణాహృదంబునిధికి.

పలుకఁడే బొబ్బిలీశ్వరుఁడు మద్రాసుశా
సనసభాధ్యక్షతాసనమునుండి
'ఇటఁ గలండు బడేటి యితని గన్గొని మీరు
ప్రతిపాదనలు చేయవలయునుండి
మనపార్టి యితఁడౌత, సునిశిత మైన యీ
తని తీక్ష్ణబుద్ధిమాత్రమ్ము కాదు
కనిపింప నెరసులు తనపక్ష మెదిరిప
క్ష మ్మన్నమాట సాంతమ్ము మఱచుఁ

గార్యసాఫల్యమొందఁగాఁ గడఁగునెడల
నాశ్రయింపుఁడు ముందుగా నతని ననుచు
సభ్యులను జూచి' దీని తూఁచాలు పోక
జరిపెఁ దా బడే యెంత నిష్పక్షపాతి.

ప్రభాతము

ఇచ్చెనా మాట బ్రహ్మేంద్రాదు లడ్డైన
రామబాణముగ నిర్భయత నేఁగుఁ
గాంచెనా కృపతోడఁ గాలాగ్ను లెదురైన
మాననివిరి తేనెసోనఁ గురియుఁ
బట్టెనా పట్టుఁ గస్పడునది మేరు ప
ర్వత మైన నూడి రావలయు నపుడె
చూపెనా చన వబ్ధిరూపుఁ దన్నా పోశ
నము పట్టెడునగ స్తుత్యైనైనఁ గినియఁ
డతని తత్వమ్ము లతనికే యర్థ మగును
అతఁడు మనియుండి మరణించి యప్పు డిప్పు
డరులకుఁ జలింపనోడని యమృతహృదయ
విలసితదయార్ద్రుఁ డగు శిలావిగ్రహమ్మె.

అని వెనుదుఃఖ ముబ్బి లయ
మైనవిధిఁ జడిగొన్న కన్నులఁ
దోనఁకుక వ్రొష్ణబాష్పముల
తో దిగిపోవు నెడందతోఁ జలిం
చిన తనుబంధనాళముల
సీలటతోఁ బయి కుబ్బువారు వె
చ్చని రుధిరారుణాంకముల
జాలులతో వడి లేచి మిక్కిలిఁ
బనవి బడేటివిగ్రహము
పాదములం బడి మ్రొక్కి రెల్లరున్.

అది కనుఁగొన్న నాకు హృదయమ్మొకశోకదవాగ్నికుండమై
యెదిరెఁ, దలంపులుల్కలయి యెచ్చటికోఁ జనిరాలె, జీవముల్
పదనగు కాలకూటవిషపన్నగదంష్ట్రలఁ జిక్కికొన్నటుల్
చెదరె బడేటివిగ్రహముఁ జేరి యెటో పడి మ్రొక్కినేనునున్.

ఈలోలనక్షత్రగోళపర్వతవనా
మేయార్ణవాంబులమీఁదనుండి
యేనాఁటినుండి తా నీనాఁటికిఁ గాల
వాహిని యాఁగక పరుగు లిడునో
యేపరంజ్యోతిస్సమిద్ధవిద్యుత్కటా
క్షమ్ము దృశ్యాదృశ్యసరణిఁ జనునో
యేపాంచభౌతికవ్యాపృతుల్ ప్రత్యక్ష
చలనచాలనశక్తి జాలుగొనునో

ఆ విశేషావినశ్వరోర్జీవశక్తి
పర్వియుండిన ఆ శిలాప్రతిమయందు
అతని ప్రాణప్రతిష్ఠ లో నవధరించి
తత్ప్రతిమ కంజలించి ప్రదక్షిణించి.

ఓ యమృతస్వరూప భవ
దుజ్జ్వలధీకిఁ బ్రభుత్వకాంత పూ
దోయిలి పట్టి రావుబహ దూ
రని ముద్దుగఁ బిల్చె నిన్ను రా

## ప్రభాతము

శ్రీయవిభుత్వకన్యక వ
రింపఁగఁ జూచెను మొన్న నిన్న దీ
ర్ఘాయువు లేకపోయినది
కాని మహాత్ముఁడవయ్య! యన్నిటన్.

పాలమును దున్ని లోకమును
బ్రోవ హలమ్మును బూనుచేతిలోఁ
గలమును దాల్చి యీ జగముఁ
గాచితి, మా తెలఁగాకులమ్మునన్

విలువను నాటి, తౌదల మ
ణీముకుట మ్మొక లోటుకాని త్వ
త్తుల విభుఁ డేడి రావుబహా
దూరులలోన బడేటి సత్ప్రభూ !

పూవులు దోయిలించినవి పో మన
యీ తెలుఁగుంబయళ్లు నీ
త్రోవలలోనఁ, దేనియలతోఁ
గలయంపిని నింపి పుప్పొడిన్
చీవెలరంగవల్లికలు తీ
ర్చెను పో మన జన్మభూమి గో
దావరిసీమ నీపదము
తాఁకినచోట బడేటిసత్ప్రభూ!

నేరిచికొన్న దీజగము
        నీ రణవెంకేతనమ్ములో మహో
దారత, నీదుమీసముల
        యందు నటించెడు ధీరసింహాగం
భీరత, నీదువాతెరల
        మీఁదఁ దోణంకుఁ గృపాసుధార్ద్రి సం
చారత దీటు లే రనిన
        సత్యము నీకు బడేటి సత్ప్రభూ!

జయరావమ్ములు వెట్టు నేఁటికిని
        తంజావూరు పాలించి వి
స్మయరీతిన్ మనవారు మున్ను
        తెలఁగా మన్నీలు మ్రోయించియు
న్నయ:శోడిండిమమంగళధ్వనులు
        సానందమ్ములై యొప్పు నీ
నయ సుశ్రీజయ సింహగర్జనల
        లోనన్ శ్రీబడేటిప్రభూ !

కఱకుంబంగరుగద్దెపై నిలిచి
        పశ్మా కాపుజాతీయతా
సరణిన్ కేశవదేవనాయకుఁడు
        కజ్జాఁ గొట్టి శ్రీకాకతీ

శ్వరుపై కేఁ దుమికించె సైన్యములు
కన్నన్నఁ జయశ్రీని లోఁ
బఱచెఁ జాతికి మెచ్చఁదగ్గ దది
కన్పట్టుఁ భవన్మూర్తిలో.

ఆస్ఫోటించి ప్రతిధ్వనింపఁగ
విజయ్యాధ్వానముల్ పూర్వ మీ
శాఖీయుల్ గద తెల్గునాయకులు
కృష్ణాగౌతమీమధ్యగో
ర్వీఖండ మ్మొకనాఁ డఖండ మగు
దోర్వీర్యమ్ములతో నేలి రా
రేఖల్ నీయెడ బింబితమ్ము లయి
వెల్గెఁ శ్రీబడేటిప్రభూ !

ఈ హేలానగరాగ్రదుర్గతల
మందే కా ప్రతాపోదయ
వ్యూహమ్ముల్ విరచించి తాము
త్రికళింగోర్వీశు లై మించి యు
త్సాహశ్రీవిజయధ్వజమ్ములు
ప్రతిష్ఠాపించి రానాఁటి మాఁ
టోహోహో ఋజువయ్యె నీవలన
నేఁడో శ్రీబడేటిప్రభూ !

## కృతి సమర్పణము

కలగా దిద్ది చరిత్ర, యీ తెలుఁగు
మాగాణమ్మునన్ 'పద్మిని'న్
'కొలనుం' బట్టణ మాకివీడు
మఱి యీకొల్లేరు దుర్గమ్ము ధీ
కలిమిన్, కాటయ భీమనాయక
తెలంగాధీశ్వరుల్ విక్రమో
జ్జ్వలులై యేలిరి వారిచిహ్నములు
సాక్షాత్కార మౌ నీ యెడన్.

తెలఁగా జోదుల కండనెత్తురుల
జ్యోతిఃపుంజముల్ లేచి ది
గ్వలయంబుల్ గ్రసియించి మింటిపయినిన్
వ్యాపించి సాంధ్యారుణో
జ్జ్వలకాంతుల్ వెలయించినప్పుడె
కదా సర్వాంధ్రదేశంబు ని
శ్చలతన్ బేర్వడెఁ దెల్గుదేశ మని
దృష్టాంతమ్ము నీ విందుకున్.

కరుణాద్యుత్తు లెగసినగతి
మెఱపులు దరలించు నీదు మీసమ్ములలోఁ
జిఱునవ్వులు మనుజవళీ
కరణమ్ములు మాకు మఱవఁగన్ దర మౌనా?

ప్ర భా త ము

నిను(గన్నట్టి ఘనుల్ భవత్పితలు
పాణిక్యమ్మ వేంకన్న లే
మణిపూజల్ తొలిజన్మ( జేసికొనిరో
మార్కండ్రాదికాలమ్మునం
దును నీతో నిఖిలాంధ్రభూవలయ
మందుం బూజ్యు లైనారు స
త్తనయుం గన్న మహాత్ముల మ్మనవని
వ్యర్థమ్మెన్న(డుం గాదుగా.

నాకృతియుం భవన్మధుర
నామపదాంకిత మైన దాట నీ
పోకడ లున్నటుల్ వెడల(
బుచ్చిన దాటను నీదుకీర్తి ది
వ్యాకృతిరూపదైవమున
కాలయ మాట( బవిత్ర మై ప్రజా
స్తోకమునందు మన్నన లి
తోధికరీతి గడించు( గావుతన్.

నాకృతినిబట్టి కీరితి
నీకును, నాకావ్యమునకు నిను(బట్టి యశో
వత్కాల్పాంతము( గలిగెడు(
గాక కళాలోకమందు( గమనీయ మ్మై.

అనుచు నేను మిగుల వినయమ్ముతో మ్రొక్కి
పూర్ణకలశవారి పూర్ణభక్తి
ధారవోసి పూవుదండలు వైచి క
ప్రమ్ముతో నివాళి పట్టి చూపి.

నిద్దానేరుపుతోడ నద్ది పలు
వన్నెల్, ద్వాదశాబ్దమ్ములున్
దిద్దీదిద్ది రసోత్తరమ్ముగ, స
భాతీర్థమ్ము లాడించి వే
ఱుద్దీ లేదని మెప్పుఁగొన్నయది
తాన్మూఁకొట్టి కైకోఁగ మున్
ముద్దుంజేసిన మత్పృభ్రాతకృతి
ఆ ప్రౌఢిచ్చిత్తిన్ గాన్కగన్.

సీదరవో మరందరస
సింధువులో స్నపియింప ర మ్మనన్
వాదము సేయుచున్ జిలుక
పల్కులు పల్కుచు వట్టిశయ్యలన్
సేదను దీర్చికొంచు శ్రమ
సేయనిసోమరిఁ జూచి నే నమః
స్వాదుపరాఙ్ముఖాయ యని
సాఁగెదఁ గావ్యరసస్రవంతికిన్.

# ప్రభాతము

## ప్రథమఖండము

అది యొక యర్ధరాత్రిసమయమ్ము మలీమసకాలమేఘసం
పదలు పరంజుకొన్నవి విభావరి నోచిననోముపంట యె
ట్టిదో యమృతంపుగీతికఁ దటిన్నవమోహనగాత్రి యాలపిం
పదో యని చూడఁగా నశనిపాతములన్ బెడబొబ్బరించెడిన్.

కటికితమస్వినీహృదయగహ్వరమందు శయించి మృత్యురా
ట్కుటిలపిశాచ మప్పుడు కదున్ నవజీవనకాలమేఘసం
పుటితనితాంతదుఃఖమయభూరితరాశనులన్ విదిల్చెడున్
జిటపటఁ దుంగశైలములశృంగతలమ్ములు మాఱుమ్రోయఁగన్

కనుఁగొనరాని తొల్లిటి యుగాలచరిత్రకు మున్ను పుట్టువున్
గనిన పురామహర్షి నిజనాథుఁ డపాంపతికిన్ సపర్యకై
చను తటినీతపస్విని ప్రసన్నపుస్విన్నకపోలమండలిన్
గనఁబడెడున్ గళంకితముగా స్మితరేఖలఁ గొన్ని రేఖలున్

ఒడల గుబగుబఁ జెమ్మటు లుబుకుచుండ
నొక్క నిమిషమే స్తంభించి యుండియుండి
వెళవెళార్భటితో గిరుల్ వెళ్లగిల్ల
నొక్క పెనుగాలి యప్పు డుఱ్ఱూతలూచె.

కాలమహోదధిన్ గలిసి కాపురమున్న వనస్పతుల్ శిర
శ్చాలనరీతితో గుసగుసల్ తముదామె పొనర్చి రాకుజొం
పాలమునుంగునన్ బిడుగువంటి కఠోరము లెన్ని మున్ను నీ
పోలికతో వహించిరొ యపూర్వము వారల ధైర్య మత్తఱిన్.

అది భయదఘోరనిర్జనమహాటవి ; అందుఁ గుటీరభాగ ; మం
దుదితరసాలమూలరచితోచితమృణ్మయవేది ; అందు నె
మ్మదిగ శయించియుండె నొక మౌని; తటాలున వాఁడు లేచి యం
బుదములవంకఁ జూచి తలపోసె నొకింత విచారఖిన్నుఁడై.

"కుమిలిన యీ సరఃకుముదకోరక మేలనొ యీ తమోంధకా
రమునకు రేకులొక్కొకటి రాల్చుకొనున్ వికచంబుగాఁ, బురా
గమితరహోనుభూతికళికాస్మృతిచిహ్నము లీ తమోంబుమ
గ్నసముదయకుత్తుకలందు నణఁగారెనొ నాకునుబోలె దీనికిన్.

నాకధునిలో సరోజమాధ్వీకణాలు
పట్టినాఁడను బంగారుపళ్లెరమున
జ్వాల లుమియు విషానిలపంక్తి వీచెఁ
గణము లింకెను బళ్లెరం బణఁగిపోయె.

గతజలసేతుబంధనముగా వికచించితి రిత్తయయ్యె నే
గతి యెటుగాఁగనున్నదొ యొకానొకరోజున నిత్యనూత్నకాం
క్షితమసృణప్రణాళికలఁ గీర్తిపయస్సులు పట్టి లోకజీ
వితములకై స్రవింపనె భవిష్యదహర్నిశ లిట్టులుండునే?

లేదు లేదోయి! నీ కాశ లేశమేని
ఆశపడితివ నీ కపఖ్యాతి వచ్చుఁ
జంచరీకయశశ్శ్రీకిఁ జంపకమ్ము
జన్మజన్మమ్ములకును త్యాజ్యమ్ము సుమ్ము.

కలవు భృంగికిఁ బరిమళకమలషండ
మధురపీయూషధారలు మనఁగవచ్చు
లేనిపోని దురాపసోపానములకుఁ
గఠినహృదయమ్ముతోఁ గాలుఁగదుపుదేల?

తమ్ముఁడా! నీదు జన్మమ్ము ధన్యతమము
నీదు జనకున కేను జన్మించియున్న
ఈ మహామైత్రివిచ్ఛేద మెసఁగియుండ
దా మహారాజ్యవిచ్యుతి యడరఁబోదు.

ఎవ రేపుణ్య మొనర్చినారలొ కదా యీ జన్మనే తాదృశో
త్సవభాగ్యోదయ మంది బ్రహ్మరథమున్ బట్టించుకోఁ; బూర్వజ
న్మవిశేషమ్మునఁ గాదె స్వాతిచినుకుల్ మహా క్త్యస్వరూపమ్ముకో
న్నివహించున్ మఱికొన్ని బుద్బుదములై నీరమ్ములన్ లీనమౌ.

దిగు లేలా ? యది భీరులక్షణమగున్; దేజస్వి కేనాఁడో యీ
జగతీసర్వగురుత్వపీఠవిలసత్స్వాతంత్ర్యసర్వస్వ మె
వ్వగ నేనీ లభియించు; నందనుక నాశ్వాసించుచున్ దద్ఘృణా
స్థగితస్వాంతములోనఁ బెల్లుబుకుఁ దేజఃపుంజ ముత్పాతమై"

అని మది నాశ్వసించి నిబిడాంధతమస్విని జీల్చుకొంచుఁ బు
ట్టిన సుషమాతటిల్లత తటిల్లునఁ తళ్ళుమనన్ బెటిల్లునన్
వినఁబడెఁ దజ్జ్వలజ్జ్వలననిర్గతవజ్రనిపాతగర్జిత
ధ్వనన మతండు నైకటలతా స్తబకమ్ముల నోసరిల్లుచున్.

ప్రణయధురీనిసర్గమధురమ్మగు నొక్క తరంగఖండవాః
కణ మతిసూక్ష్మమై యపుడు గాఢమహ త్తరశ క్తిఁ దన్మనోం
గణమణివేదిపై ని బడి గాఢి యొనర్చి నిలంగ లోపలన్
దోఁణికిసలాడి తా విరహదుఃఖితుఁడై యనుభూతిసంస్మృతిన్.

కెందలిరాకుజొంపములకే కొనలై పువుగుత్తు లింపుగాఁ
గ్రిందికి వ్రేలఁగాఁ బరిమళీకృతపూతధరాపరాగలై
ముందఱనున్న గున్ననునుబోదియతీవెలు కేలనూని లో
నం దలపోసె "మన్మధురనవ్యసుధాకణపాత్రమా ! యమా!

ఆ వసంతదినాంతసాంధ్యారుణిత న
భోవితానమ్ముక్రిందఁ దత్పులినసీమ
వలపుఁబెన్నెల్లులకు నోడల్ పులకరింప
మఱల విహరించు భాగ్యమ్ము మనకుఁ గలదె?

ఆ వనకుంజమంజులలతాంతపరాగము లంటి పాఱు గో
దావరితీరభూమి సికతామృదుసీమలఁ గ్రమ్మికొన్న క్రొ
మ్మావులక్రింద లేఁజివురుమవ్వపుసెజ్జలఁమీఁద బేర్మి నీ
తో విహరించినట్టి పరితోషదినమ్ములు వచ్చునే? యిఁకన్.

లత లల్లాడ లతాంతముల్ గురియ జాల్వాఱన్ మరందమ్ము చం
ద్రితమందానిల మల్లనల్లనను వీతెంచన్ గురంగాంగనల్
పతి శృంగమ్మునఁ గన్నుగీరఁ దఱఁగల్ మంద్రస్వనమ్మొననే
కత వాహ్యాళిఁ జరింతుమే మఱల రాకాచంద్రికాశార్వరిన్ "

అని యనుకొని మునుకొను తన
ప్రణయావేదనలు కలకులంపములై నె
మ్మనమును గోయఁగఁ బలపల
మని కంపితరుద్ధకంఠుఁడై సాంజలుఁడై.

అది మదినెంతుఁ "ప్రేమభరమైన దృంగచలరేఖలల్లనన్
గదిపిహృదబ్జమం దుదయకాలమరందము లున్నవొయి క్రో
లెదవొకో; పాంథ! డస్సితివి; లేఁతవయస్సు కడిందియెండ; యే
గెదవొకో"యంచుబాహులుబిగించుప్రియాపరిరంభదృశ్యమున్

ఏ మహనీయురాలు విరహించెనో నన్నుఁ దదీయమోహన
ప్రేమసుధాకణమ్ములకుఁ బేశలపుంజిగురాకుదొన్నెగా
ఈ మృదులంపుటంజలి వహించితి; నెన్నటి కానొ తత్కణ
స్తోమము పూరమై నిలిచి దోయిలి నా వెనుదప్పి దీర్పఁగన్.

ఏ కడగంటిచూపులు ఫలించుట కేను దపస్వినై నిరా
శాకలితాస్మదీయప్రణయాశ్రుకణాలు స్రవించుచున్ యశ
శ్శ్రీకిఁ దిలాంజలించితినొ రేవగ లిచ్చట నీ స్రవంతి సా
క్షీకృతఁ జేసి యయ్యవి సఖీ! మఱుజన్మ ఫలించునేమొలే. 24

ఇప్పు డీ జన్మ కీ ఫల మింత చాలు
నీ విశాలమహోర్మిపై నీవు నేను
వేఱుపడియు నేమూలనో ప్రేమవతి! స
జీవముల నుంటి మనునాస చెడదు నాకు.

కలియుచు స్నేహవాహిక లిఁకన్ బ్రవహించెదునన్నమాటలో
పల నణుమాత్రమేని తలపంబడ దింకిన నింకునేమొ! కా
వలసినదా ఘటిల్లినది; భావి నెఱుంగుట దుర్ఘటమ్ము; చిం
తిలిన ఫలమ్ములేదు; పరితృప్తికి మేర లభింపఁబోదుగా.

అని నిరాశావిజృంభితాయల్లకభర
హృదయ మొకమాఱు కేల్దోయి నదిమిపట్టి
మఱచె జగమును నిధ్యానమగ్నఁ డయ్యె
భక్తి పైకొనె దలఁపు దైవమును దగిలె.

ఈ ముహురుత్పతత్కలుషహేతుతమోళనిముక్తయోదమా
లాముఖరీకృతారవములన్ వినిపించును నీ యమోఘగ
ర్జాముఖరోషహుంకృతులసంచయమో ప్రభు! కాని యీనిరా
శామరుభూమి నా హృదయశారి కులాయముఁ జేరదేలనో?

ఒక ప్రణయంపుపేఁటియల యూఁచినయూపున కీ యెడంద ప్రీ
లక యొకకొంత తాళియు నిలంబడెఁగా అది నీ విలాసనా
టక మగు నో ప్రభూ! యిఁక నెడాపెడ నాచిఱుబుగ్గనిగ్గు లెం
దుకుఁ బ్రిదులంగఁగొట్టెదవు నొవ్వఁగ, నీకిది నవ్వులాటయా ?

ఈ యనంతకాలమహాబ్ధి నెన్ని యెన్ని
యనుసృతపరంపరాజన్మ లవతరిల్లి
చిదికిపోయెనో నేఁటి నీ సేవకైన
నర్పణము నన్నుఁ గొనుము దేవాదిదేవ !

భూనభోంతరహర్మ్యసోపానభూమి
నెంతకాలము పడిగాపు లింక నైన
నాదువాంఛితసత్యసౌందర్యభిక్ష
నకట! దయసేయరాదొ దేవాదిదేవ !

త్రిదశగంగాసరోజమాధ్వీకణాలు
చివురుటాకులదొన్నెల సేకరించి
యరుగుదెంచితి నీసేవ కలసిపోతి
నకట! వేయకు తల్పు దేవాదిదేవ !

నాదునయనాల జాతిరత్నాలు రాల్చి
భావసూత్రాన సూత్రించి పట్టికొంటి
రుద్ధమైపోయెను గళ మ్మెఱుంగ నిన్ను
నకట! యెచ్చోట నుంటి దేవాదిదేవ !”

అనుచుఁ గన్నీటిముత్యాల నట్టెరాల్చి
యురము కంపింప వేడినిట్టూర్పు పుచ్చి
జింకతోలును సొరకాయ కొంకికట్టి
సాదు కయికొని శిథిలోటజమ్ము సొచ్చె.

ఆ శిథిలోటజమ్మునకు నావలగా నెలమావి; దాని పూ
ర్వాశఁ దమాలవల్లికలు; వాని కుదీచిగ భద్రపర్వతో
ద్దేశము; నందు గౌతమనదీజలదీవ్యదఖండపూరమా
కాశము నంటి యీ దిగువగాఁ బ్రవహించుఁ గలస్వనమ్ముతో

స్తోకముగాఁ గుదించి చిఱుజొంపములన్ నవమాలతీలతల్
ప్రాకిన పొన్నమ్రాకు లిరుప్రక్కల బారులుతీరి నింగిపై
నేకముగాఁగ మధ్య రచియింపఁబడెన్ శిథిలోటజమ్ము వెం
జీఁకటిమ్రాకులన్ గటికిచీఁకటి గాయఁగఁ దత్పురస్థలుల్.

సంచిలోపలి చిటికెడు జమ్ముదూది
తీసి చెకుముకిఱాతిపైఁ దేల్చిపట్టి
సోవ బిళ్లను రవ్వలు లేవఁగొట్టి
యిట్టి తైలపుఁబ్రమిద ముట్టించినాఁడు.

మునికుటీరమ్ము లోపలి మినుకుమినుకు
మనెడు చిఱుదీపకళికఁ గన్గొనెనొ లేదొ
జగతికై రేల దైవసంస్థాపితమ్ము
లైన యాకాశదీపమ్ము లారిపోయె.

అపుడు నభోంగణమ్మున జలదాంగన డిగ్గి క్షణప్రభాత్మలన్
దపతప విచ్చి చూచి జడదారితనమ్మున కబ్రమంది ని
క్కపునవమార్తికోరుకరకానికరమ్మును విదిల్చి వైచి యా
తపసిగృహమ్మును రత్నఖచితమ్మునరించె నదెట్టి ప్రేమయో.

చిటపటమను వర్షోపల
చటురవతతి వినిచె నపుడు జలముల్నటినీ
నటనాప్రచలితమృదుపద
కటకనినాదానుకరణకలగీతముగా.

పిడుగుటాకుడులతో బెదరి యెల్గెత్తు త
ద్గిరిదేవతాఘృణాస్వరము వోలె
నుఱుముమాఱ్ఱోగ్రతతో నోసరిల్లెడు గౌత
మీదేవతాశోకనాద మట్లు
మెఱుపుఁబెన్జిగి మీఁది కుఱికినన్ వెఱఁగొన్న
వనదేవతాభయస్వన మనంగ
దఱిలేని వఱ్ఱొడ్డు వఱదకున్ బెగ్గిల్లు
భూదేవతార్తనినాదము వలె

ఈ ప్రచండబ్రహ్మాండమే యేమ్మురూపు
నొందినట్టులు తద్దుఃఖ ముబికి సప్త
మారుతములఁ దంత్రులుబ్రద్దెవ్వ మాఱుమ్రోగి
నట్టు లోకయాత్రరవము సంయమికి వినిచె.

కలకలకాకులీకలవికస్వరసుస్వరకంఠనాళికా
కలితనినాద మయ్యది ప్రకంపితమై చెవిసోక నేమిగాఁ
దలఁచినవాఁడో మౌని చకితమ్మగు డెందము నిల్పి నిల్పి ది
క్కులు పరికించిచూచెను ఖగోళముదాఁక రవమ్ముజాడకై.

బెడిదములు చూచి సుజనుని పేరుబెడఁద
వజ్రమునకంటె నెంతటి వజ్రమయమొ
చిక్కచిక్కిననిఱుపేద పలుకువిన్నఁ
గుసుమమునకంటె నంతటి కుసుమమయము.

భారతామ్నాయసంపచ్ఛరచ్చంద్రమ
శ్చంద్రికాధవళయశస్వి యెవఁడు
పావనాఖండగోదావరీరసపాన
నవనీతతులితమనస్వి యెవ్వఁడు
సకలాంధ్రదేశరత్నాకరండప్రాయ
శాసనస్వాదువచస్వి యెవఁడు
చాళుక్యభూమిభృచ్చరితాంబరోజ్జ్వల
దమరసౌందర్యవయస్వి యెవ్వఁ

డా మహారాజరాజున కనుఁగుఁబట్టి
చోళదేవుఁడు రాజ్యవిచ్యుతుని బొంది
భద్రగిరిసానునిర్ఝరీప్రాంతవనిఁ ద
పస్వియై యుండె నన్న నెవ్వారికి జాలి.

# ప్రభాతము

## ద్వితీయఖండము

తడిసిపోయిన కావివస్త్రములతోడ
నురుజలాకీర్ణమౌ జటాభరముతోడ
యోగదండమ్ముఁ జేఁబూని యోగివరుఁడు
జడికి వెఱువక యుటజమ్ము వెడలి నడిచె.

కనులు పెగల్చి దృష్టిపథకమ్మున నెచ్చట నడ్డమాకముల్
గనక రవమ్ముజాడ గుఱిగాఁ జనె భద్రమహీధ్రసానురే
ఖను దరియంగ నడ్డపడు గండశిలాశిఖరమ్ము సూటిగా
ననుదిననిర్గతాగత పథానుమితోన్నత నిమ్నవేదియై.

జిలుఁగుమెఱుంగులన్ గలుగు చిన్ని వెలుంగులఁ దప్పుఁద్రోవలన్
దొలఁగుచుఁ దీవ్రమౌపిడుగుదూకుడులన్ బెనుమంటధాక క
న్నులు మిఱుమిట్లుగొల్ప మదినొచ్చుచు మున్ సెలయేటినీటిరా
కలకుఁ బదమ్ములూదుచు నెకాయెకి నేగె దయార్ద్రపూర్ణుఁడై.

కుంభధారాసమంబుగాఁ గురియుచున్న
వర్ష మొక్కింత జల్లుఁగాఁ బరిణమింప
నాగు మిచ్చోట నన్నట్లుగాఁగ నతనిఁ
జీకుపొదయొండు తన కావిచీరఁ దగిలె.

తగిలిన చీకుఁగంపను విదల్ప మదిన్ గమకించి కేలు చా
పఁగ నవనీతమట్లు గనుపట్టె నొకానొకవస్తు వంతలో
మొగిలుమెరుంగు దివ్వె కది పూర్ణముగాఁ దెలియంగనయ్యె;నె
వ్వగయుదయించెగుండియలు ప్రయ్యవడెన్ గరుణమ్ముజాల్వడెన్

చూతాంకూరనియంత్రితమ్ముగ జటాజూటమ్ము గండోపల
వ్రాతమ్మందున జీరుకాడఁ జరణద్వంద్వమ్ము బాహుల్ పరి
ష్వ్యాతంబుల్ విడనాడ జర్ఝరితమై చూపట్టెఁ గాషాయసం
ఘాతమ్మంటిన మోముతోడ మృతవత్కాయమ్మొకండయ్యెడన్.

విలయకాలమ్మునన్ బూదిఁగలిసియున్న
భూతధాత్రిని సృష్టింపఁబూని చాచి
నట్టి భగవాను రక్షణహస్తమట్లు
సాదు తనదక్షిణకరమ్ముఁ జాచినాఁడు

చీకుఁ దొలఁగించి చూతమ్ము చేరవంచి
మెడకుఁ గ్రిందును మోకాళ్లమడత క్రిందుఁ
గరము లిడి యొమ్ముబలమునన్ గదిపి శవముఁ
గొని కుటీరాభిముఖముగాఁ జనె నతండు.

ఉద్ధృతుండైన పవమానయువకుఁ డపుడు
ధార్ష్ట్యమును మాని మిగుల నిస్తబ్ధుఁడయ్యె
నతిచకితలైన యారణ్యలతిక లప్పు
డభయనిస్తంద్రలై ముగ్ధ లట్లు నిలిచె.

గగనమానిని దుఃఖసంకలితహృదయ
ఫలకయై నీలిచీఁకటుల్ పులకరింప
నుడువిలోచనములు విప్పి యార్ప్వలాపి
యరయుచున్నది తన్మని యరుగుజాడ.

ఆశ్రమావరణమ్ములో నడుగిడంగ
వరుణదేవుండు తనమీఁదఁ గరుణఁబూనెఁ
దడువని కుటీరదర్భసంస్తరణమందు
జింకతోలున శయనింపఁజేసి శవము.

త్రిజగతీసింహపీఠిపైఁ దేజరిలుట
కర్హ నీ మునిబాలు నే యమ్మ కనెనొ
యుడుపథమ్మంటఁగాఁ జాలు నున్నతాశ
యముల; దరిలేని పుత్రార్తిఁ గుములునేఁడు.

ఆ పరిమళోపవనాంతరాంకురితల
తాలతాంత మీనాఁడు వ్యర్థముగ నీయ
రణ్యమధ్యస్థమత్కుటీరశ్మశాన
వాటి రాలిపడు నని యెవ్వాఁడెఱుంగు.

ప్ర భా త ము

ఋణమో పణమొ విషీకృత
గణేయమధురాత్మనాయికా ప్రణయసుధా
కణమో యీదృశగతికా
రణ మని యనుకొనుచు ద్రుతతరమ్ముగ నతఁడున్.

చిదుగుల నిప్పువెట్టి చిఱుచెంపలు తా నుబికించి యూది జె
ట్టిదమగు పేకకట్టెలఁ గడింది సెగల్ రగిలించి యల్లనన్
గదిసి శవమ్ము బొమ్మపయిఁ గావిఁ దొలంగంగఁ జేసి యంతలో
నదరిపడెన్ దటాలునఁ దమంతట ద్రావెను గంటిజెప్పలున్.

లీలాఫాలతలేందులేఖ సహజశ్రీరాజితస్మైన్మ త్రిలో
కీలావణ్యకళాలసత్కువలయాక్షిస్ఫూర్తిఁ గల్గింపఁగా
నేలా మాని యెఱుంగఁడో యురముపై దృగ్జాలపుష్పుల్ పర్వఁగే
బాలారత్న మటంచుఁ దచ్ఛవము సంప్రాప్తిల్లు కాలమ్మునన్.

మాయఁబడిన కనుంగవ మూఁతవిడదు
మునికుమారుం డితండను బుద్ధితొలఁగె
బాలిక యటంచు నిశ్చితప్రచురమాయె
వలయు వరివస్య సేయఁగా వలసియుండె.

'లేవోయీ! భవదీయనిర్మలయశోలీలావిలాసేందురే
ఖాదీవ్యన్నవమూర్తి నేవిధకళంకప్రాయికాంకమ్ము; మ
త్స్వా! దైన్యంపడ కాచరింపు వరివస్యాకర్మ లీయమ్మ; కే
దో దైవీగతి మూల మిట్టి ఘనభాగ్యోదారసంసేవనన్.

సకలస్వమ్మును సన్యసించుకొనినన్ సన్న్యాసులా కారు, తా
త్త్వికయుక్తిప్రతియుక్తినైపుణికి దైవీసేవయా రాదు, లౌ
కికదుఃఖానలభస్మసాత్కృతులపై క్షేమంకరాపాంగదృ
ఙ్నికురుంబామృతవృష్టిపాత మొకటే నిర్వ్యాజదైవార్చయా!

అని నిరాకారవాణి తన్నాశ్రయించి
యాత్మ కుద్బోధ గావింప నాతఁ డపుడు
విమలసేవాపరీక్షాప్రవేశమునకు
దైవ మొడికట్టినాఁ డని తలఁచినాఁడు.

ఆ మునుపున్న కావివలు వట్టువలె యుండఁగఁ జక్కఁజేసి పై
పై మెల మెల్ల నారవలువల్ తడియారఁగనద్ది మోముపైఁ
బ్రామిన పెన్జడల్ ముడిచి పాదములం దఱచేతులన్ దప
శ్శ్రీమహిమాన్వితుండు తనచేతులు రాపిడిపెట్టి వేడిగా.

జ్వలితానలఖండమ్ములఁ
గళేబరము నెల్లఁ గాచెఁ గంబళి గప్పెన్
దిలకించె నాడిఁ దన యం
గుళి నాసారంధ్రమునకుఁ గుడినిడి చూచెన్.

కలువుఁగన్నులఁ గరఁగిన కాంతితోడఁ
జెదగిల్లిన యూర్పుల బిగువుతోడ
భావశూన్యాస్యలులితభావమ్ముతోడ
మౌనముద్రితుఁడై శ్వాస మాని చూచె.

కేవలనరాకృతివహించు కీలుబొమ్మ
యోగసిద్ధసాత్త్వికజీవ మూదినట్లు
స్త్రీవిశేషమ్ము నెఱుఁగకే సేవఁజేసె
నింద్రియవిజేతలకు భేద మింత లేదు.

పూఁతపసిండిరేకలు నభోవిమలస్ఫటికోపలోపరిన్
బ్రోతములయ్యెఁ దూర్పున, సరోజరమానజలాక్షిపక్ష్మరే
ఖాతరళద్యుతుల్ మెరసెఁ గమ్మని తెమ్మెర వీచెఁ జేతనా
జ్యోతి ప్రభాతగీతికల నుట్టిపడెన్ లలితాంగియక్షులన్.

పూఁదేనె చినుకుతాకున
లేఁదలిరా కింతయొఱగి లేచినపగిదిన్
మోదలవార్ద్రితమై ముని
సాదరహృదయమ్ము రేకు జవజవలాడెన్.

ఇంచు కించుక ఱెప్ప లొక్కింత విచ్చి
శూన్యదృక్కుల నేమేమొ చూచి యామె
బలిమి మోచేతియూఁతఁగాఁ బ్రక్కకొదిగి
లేచి కూర్చుండెఁ బ్రాచీముఖోచితముగ.

ఎదుటను గానిపించు ముని నిట్టె కనుంగొని సంభ్రమమ్మునన్
వదనము వ్రక్కితానమితబంధురమై చిఱుకంబ మడ్డుగా
గదియగఁ జూచుచుండెఁ దెలిగన్నులలో బహుదీనభావదో
హదవిపదంబువుల్ దొరఁగ హస్తమునూది కపోలమండలిన్.

పరిచిత మేని లేని యొక వ్య_క్తి, నవ్రోఢితయౌవనాంగి, సుం
దరి మఱియుఁ స్వకీయకుహనామునిభావము తెల్లమాట లో
నెఱిఁగిన ముద్దరా లనునయించుట యెట్లగునో మఱి మతే
కరణిఁ దలంచునో యని ప్రకంపితుఁడై ముని యెట్టకేలకుఁ.

'ఓ ప్రియసోదరీ !' యని ప్రియో_క్తి చెవింబడనాడి నీదు పూ
ర్ణప్రియ మొప్ప నిర్మలమనమ్మున నీకు హితమ్ము సేయువాఁ
డీ ప్రథమాశ్రమాధిపతి యెట్టి విఘట్టన వచ్చెనేని, యే
లా ప్రిదులంగనిచ్చి హృదయమ్మును దాఁచెదవమ్మ ! సోదరీ!

నిమిషము క్రింద నాకు నళినీదళసంగతవారిఁ బోలి చి
_త్తము నిలఁబెట్టరామి యొక దైవ మెఱుంగును జుమ్మ, వేఁడి ర
_క్తము ప్రవహింపనీకు, భయకారణమేమిటికో, ప్రశాంత మా
శ్రమపద మిద్ది, యిట్టి సహజన్ముఁడు నీకు లభింపఁ డెచ్చటన్.

ఏమిటి కీ మునివేష
మ్మేమిటి కీ వననివాస మేమిటికి లతా
కోమలమృదులాల్పవయ
శ్శ్రీమహితాంగములయందుఁ జిఱుసానలిడన్.

అని యెద జాలువాఱెడిదయారసధారలతోడ బుజ్జగిం
చినయెడ, నుజ్జగించి పయిఁ జేరినకంచియ, ముండ్లుడుల్చి, నే
ర్పునఁ బరిరక్షణమ్మిడిన క్రొన్ననయట్లుఱవాడి మేను జ
ల్లన మునిఁ జూచి పైకుబుకునట్టి వగన్ దిగమ్రింగి దీనయై.

నిటలఫలకఘటితాంజలి
పుటితో 'మానివర ! మీ యమోఘమ్మగు నిం
తటి భూతదయకు నెంతటి
కటికి యయిన మోకరిల్లక మఱొండగునే ?

అనుచు జోహారొనర్చి తన కంతట నింతట నర్థదగ్ధమై
కనఁబడు దర్భఖండములకై చెయి సాచుచు వెండి యామె యి
ట్లను దమమేలు నీ తనువు వ్యర్థభరమ్మని దీనిపోకకై
యెనసెడియీకృతఘ్ను గణియింపమికిన్ క్షమియింపుఁడీదయన్.

నావుఁడు హాసరేఖ నయనాలఁ దొలంకఁగ మౌని 'యీ జగ
త్సేవఁ బునీతరీతిమెయిఁ జేసినఁగాదె విరక్తి, యద్దియే
కావలెఁ గాదె మౌని, కటుగావుట దేహికి దేహ మెన్నిటన్
గావఁగఁ జెల్లుఁ, దత్ఫల మొకానొకరోజున కేనిఁ జిక్కెడిన్.

తను వాద్యధర్మసాధన
మని పలుకుదు, రదియుఁగాక యాత్మహననమున్
జన, దంతటఁ బోవునె? యది
తన వెత మఱుజన్మకొఱకు దాఁచుట గాదే ?

కావున నట్టిబుద్ధి విడఁగావలెఁ, గష్టఫలాప్తి కోరువం
గావలెఁ, గర్మసేయవలెఁ, గర్మకు బద్ధము లోకమెల్లఁ, ద
ల్లీ! విధి నేల దూరఁగవలెన్, జతనమ్మును జేసిచూత మా
పై విఫలమ్ము గల్గ వగవన్ మన కేల? నిసర్గసిద్ధికిన్.

ని సాధించెను నవి త
త్రి! నా ర మ్మనుచు గా కి కెట్టి పిలుచు గా
కి సాధుపు సత్యస్థితి
గా నాయ మొనర్చు చాఁపఁగా నేల? యింకన్.

అని వచియించు మహానిష్ఠప్రసంగమవాఙ్మణిదీపికాసుధో
ల్బణకళికల్ ప్రసన్న తదపాంగవివిక్తలదృజ్మరీచిభ
వ్యనవనవ్యోజ్జ్వలమ్ములయి యామె మనోమయకందరాంతరా
ళనిబిడసంశయాంధపటలమ్ముల నెల్ల నపాకరించినన్.

ఎక్కడ లేని యత్న మొకయించుక మోహముపయిన్ నటింప న
ల్దిక్కులుచూచు హ్రీణమధు రేక్షణపంక్తులఁ బ్రేమవాహినుల్
పిక్కటిలన్ మునీంద్రుఁడు సుఖవీక్షణముల్ పరికించుఁ జెప్పఁగా
మిక్కిలిఁ బూను మానును నిమేషములోన ననేకభావయై.

లేఁతగులాబిపూవునును రేకులుగా మసృణారుణామృత
ద్యోతకపోలముల్ చెదరుఁ, దోన సరోజదళమ్ము లట్లుగా
వా తెఱలుల్ వణంకు, నొక వాక్కును రాలదు నోట; నేత్రజీ
మూతము లుష్ణబాష్పకణముల్ చిలికించుట తప్ప మాటికిన్.

అణువులోపల నణువుగా నణఁగువాఁడు
మహితమునకంటె మహితమై మసఁగువాఁడు
పరమపితదివ్యతత్త్వప్రభావలీల
లెవ్వఁ డెఱుఁగంగలాఁడు తా నిట్టి వనుచు.

రంగదుత్తుంగతరంగహస్తముల వా
రాన్నిధి యే రాజ్యరమను సాకుఁ
బరిమళవస్తుసంభారమ్ము లే రాజ్య
కన్యకు మలయోర్వి కాన్కఁలంపు
సహజనౌస్థానవిశాఖపట్టణ మే మ
హారాజ్యలక్ష్మికి నాటపట్టు
రాజమహేంద్రసామ్రాజ్యలక్ష్మీబంధు
తాప్తి నే రాజ్యసుందరి సుధన్య

తత్కళింగమహారాజ్యతరుణి నెలమి
నేలియుండిన ప్రభున కేకైకపుత్రి
విజయ యచ్చోటఁ దన్మౌనివిపులదయకుఁ
బాత్రముగ నోచె నంచు నెవ్వారికెఱుక.

# ప్రభాతము

## తృతీయఖండము

ఆతఁ డారీతి నామెదుఃఖాశ్రు లరసి
భయపడకు తల్లి! నుడువు మాపదలలోన
హృదయ దౌర్బల్యమును గెల్చుటే మునిత్వ
సిద్ధి కారణ్యవాసవిశిష్టఫలము.

క్లైబ్యరాహిత్యమైన నిక్కంపుఁదపము
సేఁతకును దొల్త నెట్టి వాంఛితము మివులఁ
దన్నుఁ బురికొల్పునో యదే తత్తపస్వి
తపమునకుఁ బూర్ణఫల మాచుఁ దనరుఁ దదకు.

తల్లి! ప్రణయమో ప్రణవమో తపముసేఁత
కాదిఁ బ్రేరేచినట్టి భయంకరంపు
జ్వాల నీకు, వచింపు, సౌభ్రాతృత యిది
లవము కారాదు శంకాకళంకితముగ.

అని యోదార్చి నవ్వుజీ
వనశక్తిని నాగిపోయి ప్రాఁతగిలిన త
న్మనిబాల హృదయతంత్రిక
లను గదిపిన మాని కనును లలితాంగి యిటుల్.

మాతకును గాని తనతనూజాతు కేని
దారకును గాని తన సహోదరున కేని
ప్రియునకును గాని తనకన్నపితకు నేని
ప్రకటితము గాని యొక జ్వాలపాలఁబడితి.

తండ్రి! యది నన్ను నుడుఁవఁగాఁ దఱచియడిగి
తివి, మదంతరంగంబు తద్దవదహనశి
ఖాపరీవృతమై మున్నె కాలిపోయె
దుఃఖదేవత విసుఁగెత్తి తొలఁగిపోయె.

కరఁగిపోయెను ప్రణయాశ్రుకణము నాకు
సురిగిపోయెను సౌందర్యసుమము నాది
ప్రతిఫలాకాంక్ష లేని నైరాశ్యపాత్ర
తో మిగిలియుంటిఁ బేదనై తుదకు నొకతె.

నా యెడఁదలోన నే మూలనో యణంగి
ప్రాలుమాలిన దుఃఖముల్ మేలుకొనియె
భయదమై వీచె నొక రహఃప్రళయకీల
ఈ క్షుధాయాత్ర భుగ్నమా నే క్షణమ్మొ.

నా సుధాస్మితమ్మందు నానందకళిక
దుఃఖమయదేవతకు నమస్తుభ్య మనియె
శోకగీతాలతోడను శూన్యవీక్ష
ణములతోడను నీరాజనము లొసంగి.

అదిస్వప్నమ్మొ యథార్థమో మఱపురాదా రేండ్లకున్ మున్ను నా
బ్రదుకుందీవియ నంటియూగు తొడిమన్ వర్జించి వాత్యాహతిన్
గదలింపంబడి యేడకో చనెను నా కల్యాణపుష్పంబు, తం
డ్రి! దివారాత్రము లేను దానికయి యన్వేషింతు నీనాటికిన్.

ఈ జగతి నాకునై విలాపించి నా స
మాధిపైఁ బూలమొక్క పెన్నాఁకుగా ర
హింప నొక్క కన్నీటిచుక్కని విడుచు
వారు లే, రొక మా యుమాబాల తప్ప.

ఆమె నాకై విలాపించు నామెకై వి
లాప మొనరింతు నేను, దులాతులిత మ
యిన ప్రణయభాగ్యముగల మా యిరువురకు మ
నః ప్రవృత్తు లొక్కింత భిన్నములు గాని.

ప్రణయభంగమ్మునకు నంతరంగహేతు
వరసి ప్రతిఫల మొసఁగ వెన్కంజవేయ
నట్టి శక్తిస్వరూపిణి యామె, కేవ
లము నిరాశాశ్రుపూజకురాల నేను.

ఆమె త్రైలోక్యలావణ్యసీమ, పార
తంత్ర్య మోర్వని ప్రతిభాయుత, యిఁక నేనొ
మాననీయను గాని ఖైదీని, ప్రియుఁడు
వలచె నని గర్వపడు రూపవంతురాల.

పగఱగుండెల నెత్తుటిబల్లెమై వి
హార మొనరించు నాశ్వికవీరవనిత
యామె, రెంటికిని జెడి నిరర్థకముగ
మనిన వట్టి యభాగ్యయోగినిని నేను.

ఆమె వలచినది యమానుషార్ష శక్తి
నుదితమైనట్టి యొక తపోజ్యోతి, నేను
వలచినట్టిది తజ్జ్యోతికెలన నిలిచి
జిలుఁగులేవెన్నెలలు గాయు చిన్నివెలుఁగు.

అనుచు దరిలేని హృదయవేదనము నెల్లఁ
దా నివేదనమొనరించు తఱిని మాని
తనజటాజూటమును దిద్దికొని, కషాయ
వసనములు సర్దికొని ముసిముసిని నగియె.

నగినఁ జకితయై యాతనిమొగమువంక
నాయమ తదేకదీక్షతో నరసి నేను
వట్టి యున్మాదినిని, గాని వాస్తవమున
కరయ మిమ్మెచ్చుటనో కాంచినట్లు తోఁచు.

నా కథాకథనము కూడ మీకు విదిత
మైన యట్టులె కన్పించుఁ గాని మిమ్ము
గుర్తునిడఁ జాలకుంటి వాకొనుచునుంటి
నను బరీక్షించు మీ రెవ్వ రని తలంతు.

ఏది యెట్టులైన మా యుమాహృదయకుసుమ
మకట! గలగలలాడించినట్టి చోళ
దేవునిమనోజ్ఞ సౌందర్యదివ్యమూర్తి
మత్త్వ మొకకొంత మీలోన మాన్య! తోఁచు.

నావుఁడు మానీంద్రుం డు
చ్చావచవచనముల కెడమొసంగక యీ భి
క్షావృత్తికి ముఖపరిచితి
భూవలయమునందుఁ గాక పోవునె? తల్లీ!

దాని కేమి కాని దారుణముగ రాత్రి
జరిగినట్టి కృత్య మెఱుఁగఁదలఁతుఁ
బిదప నీకథాంశ వివరణ మెఱిఁగి నా
కార్యమునకుఁ దోన కడఁగువాఁడ.

అకట! పట్టి యమాయిక వయినయట్టి
పిచ్చికల్లాల పి, విట్టి ప్రేమకలిత
లలితమూర్తికి నీకు దుర్మార్గగామి
యెవ్వఁ డపకృతిసేసి సహించుకొనియె.

ఉమకు నీ కెట్టి పరిచయ ముండె, నట్టి
యాకె నీకేల సాయము కాకయుండె,
నుడువు మమ్మ! యేడ్వకు, మాకె పుడమి జీవ
కలితయే ? యెట నీ వామెఁ గాంచియుంటి.

కష్టజీవిని! యింక దుఃఖము సహించు
కొను, లభించు మేల్ నీకు, వాక్రుచ్చుచుంటి,
నెల్లకాలము నీరీతి నేగఁబోదు,
పుడమిఁ 'గష్టే ఫలీ' యను నుడిని వినవె ?

అనిన మునిమాట లమృతపుఁజినుకు లట్టు
లాత్మదుఃఖానలజ్వాల లార్పివైవఁ
జిగురుఁగెంగేలుదోయిచే మొగముఁగప్పి
వెక్కి వెక్కేడ్చె యేమొ భావించి యామె.

అవని నుప్పొంగు దుఃఖంపుటంబునిధికిఁ
గష్టములపైని గష్టముల్ కంచుకట్ట
లనునయాలాపముల్ వాని నతికరించి
వెల్లువగ జాలువార్చెడు పెద్దగండ్లు.

మౌనియు నద్ది కాంచి మఱుమాట వచింపమనంగ. లేక 'య
మ్మా! నిలుమియ్యెడన్ దిగులుమాని,యి దేయరుదెంతునంచుమఁ
దానిలకంపమానవిమలాంబుజికన్ నికటస్రవంతికన్
స్నానముసేయఁగా వెడలినాఁ డుటజమ్మునువీడి నెవ్వగన్.

కరుణాబృంహితయై దిగంగణములఁ గావ్ గావు మమ్మంచు నా
ర్తరవంబుల్ పొసరించు పక్షిగణసంతానంబు వీక్షింపఁ బ్రా
గ్గిరిపై నెక్కుప్రభాతమాతనుదుటఁ గీలించియున్నట్టి చెం
దిరపుంబొట్టు పతంగబింబ మపు డున్మేషించె రాగద్యుతిఁ.

లే లివి త్వన్నిరీక్ష వెడలించిరి, ఈ వసుధాసుధాసురా
గాలపు మీ యుపాస్యన రహస్యథ కెంతయు నానవాలు, ర
మ్యా లలితా! యటంచు నళో మొక్కొకచే విడునబ్జినీదళో
న్మీలనకర్కుఁడుఁ జిలికె స్మేరమయూఖము లొక్కటొక్కటిఁ.

ఉర్విపై కిఁ జైతన్యవిద్యుత్స్రవంతి
తరణికిరణశలాకాగ్రతలవినిర్గ
తమ్మయి స్రవించెఁ బ్రకృతినేత్రాలు పులకి
తములయి వినూతనోచ్ఛ్వసితములు నయ్యె.

మమతఁ భూసతి యింతమున్నె ప్రసవింపఁ బోలు నేమో యుష
స్సమయారుణ్యము లావనాంగణమృగీశాబమ్ములు లాకర్ణ నే
త్రము లారంగను బెట్టికో మృదులవక్త్రా లెత్తి బాలార్కబిం
బమయూఖంబులు దృక్కులఁ బ్రతిఫలింపఁ జెప్పలల్లార్చెడిఁ.

అలఁతిజిలుంగుఱెక్క తడియార్చుకొనుఁ నెఱవిప్పి దూదిపిం
జలనును లేఁతయాకలకొసల్ చిటిలించి మలంచి వాఁడిము
క్కులకొనలఁ నిసుంగుఁబులుగుల్ లతికాంతరసల్పభానవాం
శులు ప్రసరించి ఱెక్కలను సున్నితపుంగలుగుల్ పొనర్పఁగా.

## ప్ర భా త ము

పచ్చనికొండనెత్తములపైని మణుల్ హవణిల్లు లోయలన్
విచ్చినజేగురున్నొనల వెల్వడి జల్లలరక్తవాహినుల్
వచ్చెను రాగరంజితకరమ్ములఁ దన్నికటస్రవంతికన్
గ్రుచ్చి కవుంగిలించుకొనఁగోరి నటుల్ మలరేడు ప్రేమిడిన్

నోచిన నోమునోమునఁ దనూలత పూచి ఫలింపఁ దన్నదీ
వీచికలన్ లతాంగనలు విచ్చినభక్తిని మున్గితేలి పూ
జాచితముల్ సుమమ్ము లిడి సాగిలినట్టులు తత్స్రవంతికా
వీచికలన్ ప్రఫుల్లసుమవీరుధముల్ నటియించు మెల్లనన్.

తద్వ్యుషోంగన ప్రాఙ్మహీధరగృహాంగ
ణమునఁ జిలికించి నవకుంకుమములు జిలుఁగు
లతల లేవన్నెముగ్గు లలండినట్లు
మెరసెడిన్ రాగసుమలతామృదులవనులు.

బంగారుపూఁతచే రంగారు తొలునింగి
వెల్లువనీట బింబించుచుండ
జదలంటు గుబురువృక్షపుజొంపములనుండి
బాలార్కకాంతి వైఁబడుచునుండఁ
దటపటఁ జట్టుపల్ దాటించుపులుఁగు స
వ్వడియెల్లయెడఁ జెవిఁబడుచునుండ
నిరుఁగెలంకుల ముందు నేటవాలైన లో
యలఁ గాఱు ప్రచ్ఛాయ లొలయుచుండ

నపుడ విరిసిన పువ్వుఁ దేనె లాన వెడలు
నళులతో గంధవహుఁడు త న్నంటి రాఁగఁ
దపసి నిత్యోపయోగ్య యా తటినిఁ జేరి
స్నానమొనరించి సైకతస్థలికి నరిగె.

అరిగి యట మాని సువిక
స్వరకమలకషాయగంధవహ గంధవహం
కురములు పైకొన జపత
త్పరుఁడయ్యె నిమీలితాక్షి పద్మయుగళుఁడై.

అది సమయమ్ముగాఁ గని దురాత్ములు వట్టికసాయికోఁతకున్
జెదరనివార లెప్పటి నిశీథమునుండి కుటీరభాగ మం
దొదిగి వసించి తాము వినుచుండిరొ యెట్టి ప్రయోజనమ్ముతో
వెదుక కడంగిరో యుడుకుపిండము లిర్వురు రుద్రరూపులై.

చిక్కెను జిక్కెరా! చెనఁటిచేడియ, యెంతటి మారుపీడకున్
జిక్కెనురా! జటాలిని, కృశించిన దా పెనుమొద్దుకోసమై,
దక్కె నటంచు వాఁడు పెదతండ్రివిభుత్వము మ్రింగఁజూచు,నీ
నక్కయు వానికై బ్రదికినన్ మనచోళునినోట దుమ్మెయా.

అమ్మ! యెంత జంత యగును రా! మగరూపు
తొడుగు తొడిగి మనల నడల నూకె
సోమవిభుఁడు తనకుఁ బ్రేమంపువిభుఁ డౌన?
యెంత టక్కు టక్కె నింతి యారా!

ప్రభాతము

ఓ నాలిమ్రుచ్చ ! నిన్నూరక విడుతుమా
మని నిన్ను రక్షింపఁ బూనుకొన్న
నీ కానఁ జోళదేవేంద్రుఁడు తపస్వియై
వెలయుట విని వాని వెదకికొనుచు

నినుఁ గని మురిసి యాతనిజాడ విననగు
నీచేత నని మేము నీదుకొంప
కేతేర, సోమదేవేంద్రుని నింపుగా
వినుతింతె? వాడు తజ్జనకుఁ డకట!

చోళదేవేంద్రు రాజ్యవిచ్యుతిని జేయు
టెఱుఁగ నట్లుండె? మాచేతి నెఱఁగి రాజ
రాజపట్టణ విద్రోహ రాజ్యమున్న
ములను వారికి నీ సానుభూతి నిడుదె !

బ్రదికినన్ నీవు మాగుట్టు బ్రదుకదంచుఁ
దలఁచి లోలోన నిన్ను నా దారుణమున
కగ్గమొనరింప రాక్షసి వగుచు మాకు
బ్రదికియుంటివె యీ మానిపరమకృపను.

అనికడు వేగిరమ్మునఁ దదంగనముందున కేగుదెంచి చ
చ్చినపలుగాకిముండ వెటు చెచ్చెర నాయువుఁ దెచ్చికొంటివే
మనసిజురాణి ! నిన్ జముని మాడెముఁ జేర్తుము రావె యంచు వే
ణెనుజడలన్ గ్రహించి పిఱువీకికి యూపిరి యామె నక్కనన్.

ఊపి కాలుసేతు లొక్కటిగాఁ గట్టి
బుసలుకొట్టి మిగుల మూల్గ నామె
నోట గుడ్డ లదిమి మాట రానీయక
కొంచుఁబోయినారు కుటిలమతులు.

తన మనోధ్యాన మంతయుఁ బర్ణశాలలోఁ
గల తపస్విని మీఁద నిలిచియుండఁ
దత్కథాకథనమ్ము తలపునఁ బారి మే
నెల్ల యుఁ బెల్లు కంపిల్లిపోవ
నా నీమె మా విజయాకుమారి యటన్న
నిశ్చయ మ్మెడదకు నిప్పు గాఁగ
నీమెను విడునో? మా పోముఁ డంచును వాని
జాడకై హృదయమ్ము జారిపోవ

నాకు నాతమ్మునకును సందర్శనమ్ము
కలిగి మామైత్రివల్లి యఖండరీతి
సాగునా? యంచు లోన విషాదమడర
వచ్చెనప్పుడు మౌని జపమ్మువీడి.

ముని 'పాప' మే మెఱుంగును !
జనుదెంచి కుటీరమునకు సారసదళనే
త్రను వెదకి వెదకి చూచెను
గనఁబడ దెచ్చోటఁ గనులు కాయలుకాచెన్.

కలిగెన్ జెప్పఁగరాని బాధ యెదఁదన్
 గాళ్లాడుటా లేదు, క
న్నులు మూఁతల్ వడుచుండె, మేను వడఁకెన్,
 నోరాడ దొక్కింతయున్,
దలకున్ గొడ్డలిపెట్టుదోఁచె, ధృతియున్
 దప్పెన్, భ్రమల్ వుట్టె, ని
ర్విలయమ్మై కనుపట్టెమౌనిమణికిన్
 విశ్వమ్ము సర్వమ్మునున్.

వీతరాగున కీ తీరు వెలితి కాదొ ?
కరుణ కలుగుట వీతరాగత్వ మేమొ ?
ధర పరోపకారార్థ మిదం శరీర
మనుటె యకళంకమునితారహస్య మగునొ?

మెల్లన హస్తముల్ దొరఁగి మేదినిపై దిగజారిపోవఁ గం
పిల్లి కమండలూదకము, మేను జెమర్ప ముముక్షు వేడనో
యుల్లము నిల్పిచూచి యధరోష్ఠము లూఁగిసలాడ నక్కటా
యెల్ల శరీరధారులకు నీ గతు లేకద ! స్నేహపాశముల్.

అని తలఁచుచు మందస్వర
మున మెల్లనఁ గదలి యుటజమును ముని యంతన్
గనెను బహిఃపంకాంకిత
మనుజపదాంకముల జాడ మన మెరియంగన్.

అబల స్వేచ్ఛగ వెడలి నష్టరయఁబడదు
దుష్టు లెవ్వారో బలిమిఁ గొందురు నిజమ్ము
దైవవినిపాత మాదలఁ దాల్పకుండఁ
గడుపఁగలవార లెవ్వారు కానరారు.

దైవికమ్ము కర్మ తంత్రమ్మ టంచును
బురుషకారమునకుఁ బోకయున్నఁ
జెడును గర్మలెల్లఁ జెడు నింద్రియమ్ములు
చెడ్డవాని విధియుఁ జెఱచుఁ దుదకు.

పురుషయత్నమ్ము సుక్షేత్రభూమి యగును
దైవికము బీజమగును నేతద్వయమ్ము
సూత్రపడు నేని సత్ఫలశోభి జీవి
యేను యత్నింతు దైవమ్ము దృష్ట మగును.

వీడిన వీడవచ్చుఁ బ్రభవిష్ణుతకుఁ గమకంబు గల్గు కా
కీడితరాజ్యభోగముల కేఁ విజిగీషువు స్వార్థబుద్ధికై,
వీడఁగరాదు ధర్మపదవీనిరతుండు పరార్థబుద్ధి కా
యాడిన మాటకై పురుషయత్నము నిస్పృహుఁ డేనిగావుతన్.

కర్మ నొనర్పఁబోక కలకాలము సోమరియై విముక్తిపైఁ
బేర్మివహించి నిల్వ నటవీస్థలులందు లభింప దేమియుఁ
గర్మవు సేయఁగావలయుఁ గర్మఫలేచ్ఛఁ ద్యజించి, యప్పుడే
నిర్మలమావిరక్తి, యది నేర్చు నెడన్ దపమున్ ఫలించెడిన్.

కాన జగానఁ గీరితియుఁ గావలె నాకని కాదు కాని యె
వ్వాని ప్రమత్తచిత్తతఁ దపస్విని యొక్క నెలంత కుందునో
వాని నిరర్థమైన ప్రసవమ్మునకై జగ మేవగించెడిన్
బూనెద నేఁ బ్రతిక్రియ నమోఘఫల మ్మిదుమీఁద దైవమున్

అని సవిమర్శగాఁ దలఁచి యర్థనిమేషము, పర్ణశాలవం
కను నొకమూలనున్ దగిలి క్రిందికి వ్రేలు నొకన్ గ్రహించి దు
సెను సజలాభ్రఘట్టనలఁ జిచ్చులపుంబిడుగుల్ వెడల్పఁ బు
ట్టిన నునుమించుఁదీవెఁ బురడించుఁ గరాళకరాసివల్లికన్.

పరుల కుపకారమొనరించుఁ బరమ బుద్ధి
యుతని కల్యాణకారణ మ్మగునొ యేమొ
యార్తసంత్రాణభవ్య కృత్యమ్మునందు
నభినివేశమ్ము జోడించి యరిగె మాని.

# ప్రభాతము

## చతుర్థఖండము

తన దీర్ఘశాఖలు దశదిగంగణములన్
　　లలితమౌ చలువపందిళులు గూర్పఁ
దనశిరోగ్రము ఘనాఘనపథ మ్మంటుచు
　　సహజోన్నతస్థితి చాటుచుండఁ
దనక్రిందనున్న శాద్వలవనీశాదమ్ము
　　ప్రత్యహ మ్ముదయసంపదను గాంచఁ
దనప్రాపుఁగొన్న పతంగీపతంగముల్
　　కిలకిల నోరారఁ గీర్తిసేయ

భద్రగిరిసానురేఖపైఁ బరవిడించి
క్రింది కేతెంచు సెలయేటిముందు నిలిచెఁ
దన కుజన్మకళంకమ్ము తునిసిపోవ
జాతుఖండను వటవనస్పతి యొకండు.

తదురుశాఖావరోహసంతతులఁ బెనసి
యల్లిబిల్లిగనల్లినవల్లికా వి
తాన మటఁ గొండవాగుపాథస్సులపయి
సేతువులు వేలకొలఁదిఁ గై సేసియుండు.

పోరి సమీపమందుఁ దెగిపోయిన జీవశవాలనుండి సం
ధ్యారుణరక్తదీధితు లజాండకరండము లల్లికో మహో
దారకుమారయోధుఁ డొకఁ డంకతలిన్ శిరమూని వేఁడిని
ట్టూరుపఁ దత్సపర్యలను నొక్కనెలంతుక సేయు నచ్చటన్.

శ్యామలామలదూర్వాదళాళి మీఁది
యరుణితభయానకోరుదృశ్యమ్ములోన
నొక్కఁ డసువులు తొరఁగె నింకొక్కరుండు
పెద్ద గాయమ్ముతో మూర్ఛఁ బెనసియుండె.

తాపింఛవిటపికాంతారదుర్గమభూము
లెల్లను జొచ్చి గాలించి చూచి
గోదావరీతీరకుటిలరహస్స్థలీ
పీరున్నికుంజముల్ వెదకి చూచి
భద్రాద్రిసానుప్రపాతకందరగుహా
నిలయముల్ చొరఁబారి నెమకి చూచి
పంచవటీసమీపారణ్యపుణ్యాశ్ర
మోర్వుల్ ప్రవేశించి తిర్గిచూచి

తపసి యతఁడు ఖడ్గధారియై చివరకు
కొండవాగు పాఱుగుట్ట దిగువ
జాఱుబండ కెగువతీరమ్మునపై నున్న
యా వటమ్మునకడకు నరుగుదెంచె.

నతశిరస్సుతో నేకమనస్సుతో ని
జాంకపాళి శయించియున్నట్టి యోధ
పుత్రు నతిభక్తి సేవించు ముగ్ధ నచట
వెఱపడి దృశించె సంయమివరుఁడు మిప్పుల.

నలిగి రేగిన విరహవ్రణమ్మునబాధ
మధురదరహాసరేఖలో మాటుపఱచి
మొగములో జీవకళ పొంగి పోవుచుండ
యోధుఁ డాయమ సేవలో నొదిగి యుండె.

తరుణారుణాంగుళుల నె
త్తురు దుడిచియుఁ గట్లుకట్టి తోయజముఖి య
వ్వరశూరుని ముఖమునఁ దా
మరదొన్నె జలముఁ జిలుకుచు మానిఁ గనదటన్.

ముని యద్ది కాంచి లోని వగపున్ దిగమ్రింగి తదీయదీనమూ
ర్తిని గనుఁగొంచుఁ దీయనగు తేనియసోనలజాలుమ్రోఁత చా
డ్పునఁ బ్రియసోదరీ! యని కడున్ జకితోన్నమితాననాక్షియై
కనుఁగొని యామె తమ్మునిని గ్రక్కున లేవఁగఁబోవ భక్తియై.

లేవఁగఁ బోకుమమ్మ! తరలీకృతమేని భవన్నవాంకపా
లీవిహితమ్ము శీర్షము చలించును; నీతనినిన్ శ్రమార్త ని
ద్రావివశాత్ముఁగాఁ గనుదుఁ; దానిఁక మేల్కొను దాఁక ఖడ్గకా
లీవరశక్తి నేఁ బ్రతిఫలించెద వైరుల పచ్చిగుండెలన్.

అనఁగఁ దదంకశయానుఁడు
కనుఱెప్పలు విప్పి యపుడు కని మానీంద్రున్
దన వ్రణకిణచిహ్నితద
క్షిణహస్తము పిడికిలించి చివ్వున లేచెన్.

లేచి విభ్రాంతుఁడై తేరిచూచె మునిని
జూచి నిస్తబ్ధుఁడై ముష్టిఁ దాఁచమఱచె
నెప్పుడే జన్మ నెచ్చోట నేని వారు
స్నేహతంతుపరిష్యూతజీవు లైరొ!

ఆగుము తమ్ముఁగుఱ్ఱఁడ! భయంపడహేతువు లేదు, వట్టి బై
రాగిని, ఖడ్గ మీ తరుణిరక్షణకై కయికొన్నవాఁడ, నం
తే గద తప్పు నాది, భవదీయకఠోరకముష్టిఘాత మీ
జోగి భరించునా? విమతశూరశిఖామణి కాక చివ్వలో.

అని జటాధారి తరుణీకథాంశ మెల్ల
నాకెయు దృగంచలముల నంగీకరింపఁ
సంగ్రహమ్ముగ వచియించి శాంతుఁజేసె
వ్రణకిణాంకితహస్తమ్ముఁ బట్టి వాని.

ఆ మహనీయయోధు కరమందుఁ గనంబడె మచ్చయొండు సు
శ్యామలమై సువర్ణదళమండలి నీలముగా మహర్షికిన్
మోమునఁ బ్రోవువడ్డ తలపోఁతలకున్ నులివెచ్చనై బహి
ష్కామచిరంతనప్రణయకంఠగతాశ్రులు చిందువందఁగన్.

తన పినతండ్రిసూనుఁ డగు తమ్ముఁ డొకండొకనాఁడు బాల్యమం
దునఁ దనతోడఁ గత్తిగొని దొమ్మి యొనర్పఁగ నేర్పుకోసమై
మొన తెగగీసి తత్కరము ముద్దుల మచ్చ యొనర్చె నయ్య దే
యనుదినమున్ గనంబరచి యాతఁడు తాఁదనతోడ మోదిలున్.

అతఁడు సోమదేవుఁ డౌట యా జడదారి
గుర్తువట్టె లోన గుబ్బటిల్లె
నతఁడు మాత్ర మతని యానవా లిడకుండె
మునియుఁ దన్నుఁ దెలుపఁ బూనుకొనక.

కరమున మెల్లన నాతని
చిఱుగడ్డము పుణికిపట్టి చెప్పుము నీ వె
వ్వరో యెట్టులఁ గాచితొ యి
య్యరణ్యమున నీమెఁ దమ్ముఁడా! నా కనియెన్.

అన విని మాట మాటకు సుధాంశునిలోపల గండి వెట్టి చ
ల్లని కిరణమ్ములన్ వెలికి లాగి గుటుక్కునఁ గ్రోలి చెమ్మగి
ల్లిన విధమౌచు మైమఱచి లేచి తపోవరు బిగ్గ కౌఁగలిం
చెను యువయోధ,మౌని వివశీభవదింద్రియసర్వుఁడై యనున్.

ప్రభాతము

ఐందవోపలకర్పూరచందనార్ద్ర
లమలశీతలతుహినమందానిలములు
ముగ్ధభవదీయపరిరంభమునకు సరియె ?
ఇంక నొకమాఱు కౌఁగిలియిమ్ము నాకు.

సాన మెరుఁగిడ్డ తళుకువజ్రాలఝరణిఁ
బొరలి చిందు ద్రాక్షాసవఝరుల వంటి
యంతరతరంగితప్రేమ లాప కీవు
ఇంక నొకమాఱు పరిరంభ మిడఁగదోయి !

అనియమాంతము తన్మోని యతనిఁ దనదు
రెండుచేతులఁ గొని కౌఁగిలించుకొనియె
నమలమైత్రికిఁ బరిరంభ మానవాలు
అది యొకానొక జీవకళానుసంధి.

అఱగడియ యతని ప్రేమా
దరదృఢపరిరంభకలితతనుఁడై పులకాం
కురములతో యువకుఁడు కం
దరవ మ్మశ్రులను రాల్పడఁగ నిట్లనియెన్.

పరిణతకఠోరపద్మగర్భచ్ఛదాంకు
రామలావ్యాజసుకుమారమై మరంద
చంద్రచందననిష్యందజడము నైన
ఈ పరీరంభ మెన్నడో యేను గంటి

అనఘ ! మిములను గనుగొనుటాది నాదు
హృదయమం దేదియో భావ ముదయమగును
సుముఖ ! మీమోముఁ గనుటాది సొలసి నాదు
శుష్కజీవముల్ పులకించు చున్నవయ్య !

సాముకండెల దీర్ఘహ స్తములతీరు
విపులవక్షస్థలము ముఖవీర కాంతి
ఆ విశాలాక్షికలు మాట లాకళింపు
లచ్చముగ మీరె చూడ మా యన్నగారు.

ఈ ఫాలభాగంబునం దీ బూది రేకలు
తొలగించి కస్తూరితిలక ముంచి
ఈ కటిస్థలిపైని నీ కావి మలగించి
తపనీయకౌశేయ ముపచరించి
ఈ దక్షిణపుఁబాణి ఈ త్రిదండ మటుంచి
ఈ మహాఖడ్గమే యెపుడు నిలిపి
ఈ కిణాంకితమైన డాకేల నీ కమం
డలువును విడిపించి డాలు పూన్చి

జడలమొత్తమ్ము కాకపక్షములు చేసి
నిన్ను మాయన్న నొక్కచో నిలుపునెడల
నీవు నీ వని తెలిసి వర్ణింపనగునె ?
బ్రహ్మకును నాకు మా యుమాబాల కేని.

మా యువ భగ్నమైన సుషమాప్రణయాసవపానపాత్రతన్
దోయిలి యొగ్గి యెంత ఘనదుఃఖముతోఁ దపియించుచున్నదో
యీ యిటవీశ్మశానపరిహీణతలమ్ముల లోనె, పూజ్యురా
లాయమ నాకు, నీ విజయ కంతటికంటెఁ బ్రపూజ్యయెప్పుడున్.

మా యగ్రజువార్తన్ విని
యా యువయును లేచిపోయె, నది గాదరయన్
మా యిర్వురి ప్రేమకునై
యాయమ యటు చేసియుండు నని కని విజయన్.

విజయా! ఆ యువ నీకు నాకుఁ గల సంప్రేష్ఠమ్ముకోసమ్ము సం
త్యజియించెన్ గద మాతృదేశమును, సాంద్రారణ్యసీమమ్ము లీ
విజనోర్వీధరభూము లీ చటుమహాభీక్రూరకంఠీరవ
వ్రజసంకీర్ణతలమ్ము లాత్మనిలయప్రాయమ్ములై పోవఁగన్.

అనుచు మునివంకఁ జూచె దైన్యమ్ము మిగుల
విజయువంకను జూచె నైస్పృహ్య ముఖుక
నతనిలోపలి భావమ్ము లతనిలోనె
కెఱటములు గట్టి కడఁదాఁకి కెడసిపోయె.

# ప్రభాతము

## పంచమఖండము

మన మెరియించు నట్టియుమమాటవచించినయంతమాత్రలోఁ
దొణఁకిన వేఁడుసంద్రములు తొయ్యలినేత్రయుగమ్ములోపలన్
మునిహృదయమ్ములోఁగరఁగిపోయిన వేడుకులాచలమ్ములన్
గనుఁగొని సోమదేవుఁ డది గ్రక్కదలెన్ ధరణీజ మట్టులన్.

అంతును బొంతులేని తన యాత్మకు సంయమనమ్ములేకయిం
తింత యనంగరాని మతినిష్ఠితనిష్ఠురవిప్రయోగపుం
జింత దవాగ్నియై యెదురుసేరిన భీతిలి లోఁదలంపులన్
దొంతర గట్టఁగా విజయతో వచియించెను మాని మెల్లనన్.

ఓ కరుణాపరిదేవిని !
నీ కుమ కేపగిదిఁ గలిగె నేస్తము మఱియున్
నీకుం బ్రపూజ్య యెటులగు
నా కలికి వచింపుమా యథార్థ మనంగన్.

ప్రతిపదిందుసుధానవాంశు రేఖను సోకి
కరఁగఁబారిన యిందుకాంత మట్లు
వాసంతికామృదూజ్జ్వలనవస్పర్శతోఁ
బులకరించిన మావిదళము వోలెఁ
బ్రత్యగ్రవికసదబ్జాసవమ్మున వ్రాలి
రాగిల్లు నెలదేఁటిరసన పగిది
నాత్మీయరసకావ్య మచ్చుకెత్తిన దాని
మొదటఁ గాంచు కవీంద్రుహృదయము వలె

ఆమె హృదయ మ్మరీణభావామృతమున
స్నానమాడిన దచ్ఛాచ్ఛసంస్కృతమ్మ
నైన దా శక్తి యా మానియందుఁ గలదొ
ముందుఁగల యోధపుత్రునియందె కలదొ.

ఆర్ద్ర ప్రశ్న కామె యవనతయై మ్రొక్కి
పలుకు, నో మహానుభావ పూజ్య
రాజరాజపురిని రణధీర మా యుమ
వలనఁ గాదె నాకుఁ దొలఁగెఁ జెఱయు.

నన్నుఁ జెఱనుండి వెల్వఱచి నా ప్రియు నీ మహనీయుఁ గూర్తు నీ
కన నొకనాఁటిరేయి భయదాటవికిన్ జనుదెంచినార మే
చిన వెనుపట్టునన్ గదలి చింతలతంతల డస్సి ఖడ్గపా
ణినియయియా కెమున్న నడ నే వెనుకన్ మగరూపు లొప్పఁగన్.

ఈదృశమైన యొక్క సెలయేటిదరిఁ బెనుమ్రాకునీడ నా
హ్లాదముగొల్పు శాద్వలతలమ్మున నేమును గూరుచుంటి మే
దో దరి దేవుఁడే మనకుఁ దోఁపనొసంగు నటన్న బుద్ధి సూ
ర్యోదయవేళఁ ద త్తరులనూడు రసాలము లారగించుచుఁ.

ఏమో తా నొకరీతియై యపుడు నా యీమూర్తి వీక్షించి చె
ల్లీ! మజ్జీవనకాళరాత్రి కిఁక లేనేలేదె భానూదయ
మ్మీ మానుష్యకిరాతలోకమున; గానిమ్మెంతకే నీ యభా
గ్యోమాబాలయె చాలు లెమ్మనుచు నిట్టూర్చెన్ శిరమ్మూచుచున్.

తలయూచి పలుకు నాచెలి
పలుకున కాతురము భయము పరువిడ నే 'నీ
పలుకుట యక్కా! యే'మని
యలుకుచు నొకయింత గ్రుచ్చి యడిగితి నామెన్.

చెలియల! యూరకే యిటు వచించితి దీనికి బెంగసేసి వె
న్గళవళమందఁగాఁ దగునె? కాలికిదాకినముంటి ముంటితోఁ
గెలకుట నా మతమ్ము విడిగేఁ మనయిర్వురకాలనొక్కముల్
తెలియనిపిచ్చిపిల్ల! వెకలింపక యెట్లది యోర్వవచ్చునే?

ఇది రమణీయమైన సెలయేటితటీవిజనస్థలమ్ము క్రొం
బొదలమటుంగునఁ గదలి పూవుఁజెలుల్ వలపుందువారముల్
చిదివెదుఁ జూడుమీ భవనసీమలలోఁ జెలులట్లు చెల్లి! యీ
యెదలఁగరంచుకొండ సెలయేటిజలమ్ములల నింత మన్రశువుల్.

కుటిల మెఱుంగనట్టి వవిగో మనవంటికురంగముల్ కురం
గటఁ జరియించు, నీ మసృణగండశిలాశిఖరమ్ముదండ నీ
యటవులఁ బోర్లఁబడ్డ ప్రణయాసవపాత్రకణాలకోసమై
యిట నొక పూరియిల్లురచియింతముయత్నమొనర్పఁ జెల్లెలా

అని నుడివి నాదుసమ్మతిఁ
గొని నాచెలి తనదుకత్తిగొని యొక వెనుప్రమా
కును దునిమి 'యిదే తీరున
మనప్రణయవిరోధి కగుఁ జుమా యనినగియెన్.

వెడలి రాట్పురినుండి యీ యడవిఁ జేరు
నడుమ నెన్నియో రోజులు గడచిపోయెఁ
గాని నాఁడుగా కేనాఁడుగాని మా యు
మావదనమందు నవ్వన్నమాట నెఱుఁగ.

ఇర్వురము మేము పూరింటి నేర్పరించి
కొని వసించువేళను నొక్కదినమ్మునందు
నాదృతిన్ నాదుజనకనామాంకితాంగు
ళీయకమ్ము నా ప్రేల మత్ప్రియసఖ కని.

ఇది యెటు లోసి! చెల్లి! గ్రహియించెదవ్వదంగుళి జీవకోటి క
భ్యుదయమొ లేక నభ్యుదయమో విలసిల్లును దీనిమోమునం
దొదుగుచు, దీనితోఁ జిరవియోగముగల్గిన రాజ్యలక్ష్మికిన్
జెదరవు గాదె? ముంగురులఁ జెందిరపుందిలకంపుశోభలన్.

అన విని నే నంటిని నా
యనుఁగుంజెలి కష్ణ, డక్క! యన్నియు మా ప్రా
క్తనరాజ్యేందిరకున్ మా
జనకునితోఁ దీరిపోయె స్వాంతము కలఁగన్.

ఓ పూజ్యపాద! యా తఱి
నాపితపరిహీణదశ మనఃఫలకమునన్
దోఁపఁగఁ జెలిచేతుల మూ
ర్ఛాపరవశనై పడితిఁ గలఁచు నిపు డదియున్.

తెలివిదప్పిన నన్నెట్లొ తెప్పరించి
నాకనులనీరు కెంగేల నాకె తుడిచి
పొదివి యొడియందుఁ జుబుకమ్ము పుణికి శోక
ముడిపి పితృదురన్మరణహేతు వడిగె నన్ను.

ఏ మని చెప్పెఁగొందు నది యిప్పుడుఁ గన్నులఁగట్టినట్లు నా
కా మరణంపుదృశ్యము భయానకమై కనిపించు, నోముని
స్వామి! విషప్రయోగ మనివైద్యులు సెప్పిరి,తత్ప్రయోక్తయు
ద్దాముఁడు నన్నుఁ జంపుటకుఁ దాను యతించెడినేఁటికింకనున్

అతనినామ మిష్ణ డక్కట! మీముందుఁ
బలుకరాదు సైపవలయు నన్ను
ననఁగ సోమదేవుఁ డనె విజయాదిత్యుఁ
డతఁడు నాదుతండ్రి యబల! కాద?

మీముందని యన నేలా
నాముందని పలుకరాద? నాకున్ నీకున్
ప్రేమయె తగదని యాతఁడు
తామసియై యుంట నేను దన్వి! యెఱుఁగనా?

అనినన్ గొంకుచు విజయయు
ననుఁగుఁబ్రియున్ జూచిచూడనట్టులఁ గనుచున్
మునివంకఁ జూచి యవ్విధ
మనఘా! యెఱిఁగితిరి కాద? యాపై వినుఁడీ !

ఈ పడియున్నవా రిర్వురు రక్కసుల్
నిన్నమాపటివేళ నన్నుఁజేరి
యాతిథ్యమును బొంది యటు ప్రసంగముఁదెచ్చి
చోళదేవుని గుణస్తుతి యొనర్చి
రాజరాణ్ణగరవిప్లవకార్యదీక్షను
దెలిపి తోడ్పాటు నర్థింప నేను
గటకటఁబడి బుద్ధిగఱపి యీ సోమదే
వుని మత్ప్రియు గుణాఢ్యుఁ బొగడినంత

వారు బుసకొట్టి చోళదేవప్రభునకు
నీవు సరికోటిఁజేరిన నిక్కమైన
మేకవన్నియపులివంచు మీఁదికుఱుక
నేను నెదిరి మత్ప్రియు వినుతించుచుంటి.

ఇందు మడిసినవారిలో నీతఁ డపుడు
కాఱుకొన్నట్టి దౌష్ట్య మక్కసము నిగుడ
గిరితటాంచలమునుండి గెంటె నన్ను
నింత జరుగునటంచు నే నెఱుఁగ నపుడు.

అటనుండి పడుచు గిరికోని
తటముపయిన్ జూత మొకటి తగిలినచేతన్
దిటవూది యార్తరవ ము
త్కటముగ నొనరించి తెలివితప్పినదానన్.

అక్కటా! మా యుమాబాల యంతమున్నె
హేమరసమున మిన్ను మొలాముగొన్న
సంజవేళను దీవించి చనెను నన్ను
గాకయున్న నా గతి నాకుఁ గలిగియున్నె?

అటుపై మీ కెఱుకయ కద!
కటుదుర్భరమౌ మదీయకష్టతమిస్రా
పటలమున కడ్డుపడితిరి
పటుదీప్తిన్ మీరు లోకబాంధవులగుచున్.

జనకతుల్యులరైన మీ సాయమునకు
నింత నిర్భాగ్య యీమె యే మిడఁగఁ గలదు
వందన మొకండుగాక మద్వ్రజవిలస
దంగుళీయక మిపుడైన నకట! లేదు.

అస్మదీయసమస్తరాజ్యమ్ముతోడ
మత్సువర్ణాంగుళీయకమధ్యకలిత
జనకనామాక్షరాక్తవజ్రంపురవ్వ
యొక్కటే తూగు నో మహాయోగిచంద్ర!

దాని నావ్రేలఁ దొడిగి నాతండ్రి తనదు
చరమదశలోన దీర్ఘనిశ్వాసపూర్వ
కముగఁ నాకుఁ గూఁతురవుగఁ గొమరుఁడవుగ
నీవెగా కన్నతల్లి! జనియించినావు.

ముగ్ధభవదీయహృదయకపోతి నీ ర
చించిహావణించుకొన్న యే జిలుఁగుఁబంజ
రమున రవళించునో యట వజ్రపురవ యిది
వెలయుఁ గల్యాణదీపికాకళిక గాఁగ.

నాకయి పిచ్చితల్లి! నయనమ్ములతో రుధిరాంజలింపఁగాఁ
బోకుమ, యిప్పు డీ వయసుపోయిన నీ ముదివగ్గుతండ్రికై;
నీకు సమస్తరాజ్యకమనీయ కిదంమహితాంగుళీయక
శ్రీకి నుపాస్యదైవము వరింపనినాఁ డిది తప్ప దెట్టులున్.

ఈ సువర్ణాంగుళీయక మెవనివళమొ
యాతఁడు కళింగసర్వరాజ్యమ్ము నేలు
దీని గొనిపోయి శ్రీసోమదేవపతికిఁ
గానుకవెట్టి సుఖింపుమా! కన్నతల్లి!

అనుచు నిట్టూర్చి, తుడిచి నాకనులనీటి
కాల్వ, నాచేయి తడిగాఁగఁ గనులకద్ది
కొనుచు నాఁడు నాతండ్రి వ్రాక్రుచ్చినట్టి
చరమసందేశ మదియె యిజ్జగతి నాకు.

కుమిలిపోయిన నామనఃకోరకమును
గలియఁబిడిచి విషాదార్ద్రమలినబాష్ప
బిందువుల రెంటి మూఁటినాపితృసమాధి
దివ్వెలో రాల్చిపోతి మత్ప్రియునికొఱకు.

అది యోఁగాము లెఱుంగనీని హృదయాహ్వానమ్ము తల్లక్ష్యసం
పద ముందై వెలుఁగన్ మృదూజ్జ్వలమధుప్రారంభసంరంభ ష
ట్పదినై యేగితి రివ్వురివ్వుమని, సంభావించి యీ ప్రేమమూ
ర్తి దిగంతమ్ములనుండి నా కపు డతంత్రీవార్త విన్పింపనా.

నా కెటనుండియో కణకణమ్మన నాతను వుజ్జ్వలించిపో
నాకధునీతటీవిజననందనకుంజతలమ్ములందు నే
నాకిసినై లయించినటుగాఁ బ్రణయామరభవ్యగానముల్
ఈ కమనీయమూర్తివినిపింపఁగ నేగితి నప్పు డెంతయున్.

నా సమధిక్షితౌశ్వగమనమ్ము మనోగతిమీఱఁగా నభ
శ్శ్రీసమలంకృతమ్మయిన సింధురపుందిలకమ్ముగాఁ బ్రతీ
చీసతిమోమునన్ దరణి చెన్నువహింపఁగనున్న వేళ వి
చ్చేసితి రాజరాణ్ణగరసీమలలో నొకచోటి కొంటిగన్.

నాకై వేచిన కోడె త్రాఁచు మునిపంటన్ బుక్కిలింపన్ విస
మ్మే కుంజస్థలి బుస్సుబుస్సనెడినో, యీ నాశ్రవఃపేటియం
దే కాలాభ్రమహాశనిచ్ఛటలు నాకీ జీవముల్ నిల్పునం
దాఁకన్ భద్రమెనర్పఁగావలెనొ మంటల్ తగ్గిపోకుండఁగన్.

నా యీ దైన్యపుఁగంఠనాళిక నసుష్ణమ్మై నిరాశామయ
మ్మై యల్లాడెడి రక్తబిందువుల సాంధ్యారుణ్యలావణ్యముం
బూయంగాఁ దగునంచు నెంచుకొని యేపుణ్యుండుస్వీయోరుకా
శ్లేయమ్మందుఁ గఠోరకాలిమముఁ గైసేయంగ నూహించెనో.

ఆశంకింపఁగ నేల, పోయెద, నిరీహాజ్యోతివెల్గించి పూ
జాశంఖమ్మును నూదుకొంచుఁ బ్రణయజ్వాజ్వల్యదేవాలయా
భ్యాశమ్మందున నిల్చి గర్భగుడి నాస్వామిన్ సమర్చించి యే
నాశంబై యట నిల్వఁ బ్రేమకు నభిజ్ఞానధ్వజస్తంభమై.

చావంబాల్పడు నామనఃప్రణయపూజాపుష్పపుందీవెను
జ్జీవిన్ జేయఁ బ్రతిక్షణమ్మొకయనిశ్చేయ్యార్ద్రవాసంతిక
శ్రీ విచ్చేసి,ప్రియుండు మున్ బ్రతిముహుర్నిర్నిద్రరాగాత్ముఁడై
త్రోవల్ నాకెటఁ జూచునో యచటిలీలోద్యానమున్ జేరితిన్.

అది రాత్రించరకేళికాభవనమై యాజన్మదుఃఖైకభాక్
సదనమ్మై నరలోకవక్రిమము రాజ్యమ్మేలు వెన్గద్దియై
తుదయే లేని మహోదధిప్రళయమధ్యోద్ఘూర్ణదావర్తమై
మదికిన్ దోఁచెను స్వామి! లేఁడచటఁ బ్రేమస్వామినాకోసమై.

చెదరెనుగుండె, మేన్ వణఁకె! జెమ్మటలూరెఁగనుల్ భ్రమించెనా
బ్రదుకది బూడియాచుఁ బుటపాకముగాఁగ దహిల్లి పోయె నే
మిది యనరాని జంకొకటి యేర్పడెఁ జిన్నిపులుంగు కోలకుణ్
బెదరుచు గూటికై పఱచి పిల్లికిముంగట నిల్చినట్లుగన్.

అడుగిడ లేదుముందుకుహయమ్ము రికాబునుద్రొక్కికళ్లెమున్
సడలిచి సన్నయిచ్చితిఁ గశణ్ బ్రసరించితి మూదలించితిణ్
మెడపయి జూలు చేఁబుణికి మీటితిఁ గాని తురంగలింప దా
బడబ తదర్థ మే నెఱుకవట్టి చివుక్కున డిగ్గిచూచితిణ్.

కాటుకముద్ద కార్నలుపుఁ గ్రక్కెడిచీఁకటిపుంజుకొన్న య
చ్చోటు పిఱుందు ముందుఁ గనుఁజూపు పెగిల్చినిగిడ్చిచూచితిన్
ఏటికి నీ శరీర మనిపించెను, దోఁచిరి తద్వనాంతశ్చం
గాటకపార్శ్వకుంజలతికాంతరనిర్గత ఘోరఖడ్గికుల్.

చఱచఱ మంచు నాదెసకు సాగిరి, ఖడ్గము నూఱుకొంటి, వెన్
చఱచితి గుఱ్ఱమున్, బయికిఁ జంగున నెక్కితి; జెంగలించె నా
తురగ మరాతివీరులకుతూహలముల్ పరికించుపొంచెః ద
త్ఖురపుటనాట్యరేఖకు గగుర్పొడిచెణ్ బలిగోరి ఖడ్గముణ్.

వెళవెళ మ్రోగె ఖడ్గములు బిట్టొలికెణ్ రుధిరమ్ము, శత్రులణ్
వలఁగొని సూడుపట్టి పఱవల్లొనరించి పిఱుందగిట్టలణ్
నిలఁబడి ముందు కాళ్లెగచి నిల్పి భుజమ్ముల హేష వెట్టి క
ట్టలుకహయమ్ము తాఃబటపటణ్ గొఱికెణ్ మునిపంట నొదలల్.

మడిసెను శత్రువర్గ మభిమానము దక్కెను దజ్జయమ్ము నా
కుడుగర వెట్టినట్టి హాయ మొక్కటియే దిగజారిపోయె నీ
చెడుఁబని కేల పూనితి నినీ! కఠినాత్ములక త్రికోఁతకున్
మెడయిడె నాకు నాపయిని నెంతటి విశ్వసనమ్ము దానికిన్.

మునుమును మా ర్తురన్ దెలిసి మోహార మొగ్గియొకింత సన్నగాఁ
గనుఁగలిగించి నాకు రిపుకాండముతో నెదురొడ్డి పోరి యా
యనిపయిఁ బ్రదెల్లినట్టిది మహాశ్వము కాదది, నోరులేని నా
యనుఁగుఁబడంతి నాదునయనామృతఖండిక యామునిప్రభూ!

ఉడుగనిసేవలోఁ దగిలి యూపిరి నాకయి యాహుతించె, నా
యడుగులజాడయే తన కనంత సుఖండము నా ఫలమ్ము, నా
బడబ జగాన నాకుఁ గలవైన జగంబును బ్రాణ మేల? నా
నిడుదకటారి నా యెడఁద నించుట మేలగుఁ గాదెయంచటన్.

పొడిచికొనఁ బోయి సంశయ
పడి పరికించి తలఁపుఁబడిఁ బఱతెంచిన యా
యొడయని ప్రేమజ్యోతికిఁ
దడయక స్నేహమ్ము నీఁ గృతఘ్నను నైతిన్.

అని చూడన్ బ్రియువంక నాతఁడును దీయందేనెపెన్వ్రాకలన్
బ్రణయానందమరీచివీచికల లీలాడోలగా నూగు హృ
న్మణినౌకన్ విహరించుచున్ మధురనూత్న స్వప్నసౌందర్య దే
విని బూజించుచు సిద్ధిఁగాంచి నటు లన్వీక్షించియాసుందరిన్.

దేవీ! యెంతటిపాటు నీ కొలసెనే? దివ్యాస్యదివ్యాంబర
శ్రీవిభ్రాజితదివ్యసుందరికి లక్ష్మీపుత్రి కామ్నాయపుం
గైవల్యంబగు భావసామ్యమును సాక్షాత్కారమున్ జేయు స
ద్భావజ్యోతికిఁ బ్రేమరూపిణికి విశ్వస్రష్టయే లేఁ డటే.

అకటా! నా బహుజన్మదుఃఖనుదియేమందుర్ బ్రియాశోకరూ
పకమై యగ్రజదుఃఖరూపమయి యిర్వంకల్ దలారించు ఘా
తుకయోధాగ్రణి చేతికత్తియగుచున్ దూయున్ నిరీక్షానిరీ
హాకకాఠిన్యము నాయెడంద, నెటులాహా! యింక శాంతింపదన్?

అని విజయవదనకమలముఁ
గనుఁగొని యావేదనమునఁ గదిరెడియువకున్
మునివరుఁడు మేను నిమురుచు
ననియెను మెలమెల్ల నుడుల నమృతము నిలువన్.

ఈయమపడ్డపాట్లెడఁద నేచుఁ దలంచుకొలంది, దుఃఖమున్
డోయిలిపట్టి త్రావినది, తూలినజీవము నిల్పుకొన్న, దీ
ప్రాయపుభావసౌరభ ముపాయనమిచ్చుకొనంగ నేఁడు ప్రే
మాయతనంబుఁ జేరినది యందలిస్వామికి దుఃఖ మేలరా?

అని, తల్లి! కడమ జరిగిన
పనివిత మెఱిఁగింప నీకుఁ బట్టునొ! శాంతిన్
గొనవలతొ! యనఁగ నాచెలి
మునివరు యువవరుని నొక్కమొగిఁ గన్గొనుచున్.

స్వామీ! యున్నది కష్టగాథ యది విజ్ఞాపించినన్ మత్ప్రియ
స్వామిన్ గష్టముపెట్టుటే యగు, నభిప్రాయం బనుక్తార్థ మా
చో మీ స్వాంతముఁ గష్టమున్ బొరసెడిన్,సూత్రించి నేనీవనీ
సీమన్ జేరుటమాత్రమే నుడివి మీ సేవన్ బ్రశాంతించెదన్.

ఈమనికట్టు తప్పినది హేతికి, నారయఁ డీవ్రణమ్ము, లు
ద్దామపరాక్రమప్రళయతాండవమాడినవాజిచుట్టుఁ ద
ద్భూమిఁ బ్రదక్షిణించుకొని పోయితిఁ గేవలపాదచారిణిం
గా మెఱమంగ నాయెడఁదనాటినఖేదశలాక మాటికిన్.

అరయఁదగినచోటు లన్నింటి నరసితి
సోలిపోతిఁ జాలఁ దూలిపోతిఁ
బ్రియుఁడు కానరాఁడు ప్రియమైన వస్తువే
పుడమి నాకు లేకపోయె నపుడు.

తిరిగి తిరిగి బడలి పురఘంటికా స్తంభ
వీథిఁ జేరుకొంటి వేఁగువేళ
ముందుమ్రొగ్గి కంబమునుదాఁకి సోలితిఁ
జిటిలిపోయె నొసలు స్మృతియుఁ దప్పె.

ఆపయి నేను రాట్పురమునం దొకచోఁ జెఱనుంటమాత్రమే
జ్ఞాపక మిట్టినాపయి నకారణకారుణికంబుఁబూని తా
నే పగిదిన్ జెఱన్ విడుమరించెనొ మాయుమ, నాకు నింతయున్
దోఁపదు, సజ్జనుల్ పరహితోన్ముఖచిత్తులె కా నిసర్గతన్.

మాయుమ చేసినట్టి యుపమారహితమ్మగు మేలిసేవ కీ
యాయువు సర్వమిచ్చినఁగటా! ఋణమింతయుఁ దీర, దేలనో
యాయమ చిన్నియుంగరముకై తమివడ్డది, పుచ్చుకొన్న, దా
హా యని మెచ్చుకొన్నది,బళా!యని యాచిన దాత్మశీర్షమున్.

చెలియల! నీ విటన్ నిలిచి చేయుమ ప్రేమతపస్సు, దానికై
వలయుఫలమ్ము నే నిడుదు వచ్చి, విలంబన మయ్యెనేని యే
కళవళ మొందఁబోకుమ, యఖండతపఃఫలమును్సుఖమ్మునై
కలిగినఁ గల్గు నీ కిటనె, కమ్మనికాన్కలుగాఁగఁ గష్టముల్.

అనుచు బుజ్జగించి యానందకళికతో
నప్పు డపుడు వచ్చి యరసి నిన్నుఁ
బోదునంచు నామె పోయెను మలిసంజ
రాగలక్ష్మి తన్ను సాగనంప.

ఆమెసత్యవచన మనుభూతమయ్యెను
మీ కృపావిశేషమిళిత మగుచు
నాడనేగినట్టి యమృతంపుఁదీర్థమే
యెదురువచ్చినట్టు లితఁడు దొరకె.

ఇప్పటికిఁ బెక్కుమాఱులు చెప్పినట్లు
వచ్చి మాయుమ నన్ను దీవనలఁ దనిపి
పోయినది నిన్ననే వచ్చిపోయె మఱల
మీరు దుష్టులు నన్నను జేరుముందు.

అనివచియించియామె హృదయమ్మమృతమ్మయిపోవ, దేహముః
దానఁకని షానపాత్రవలెఁ దోఁపఁగ, సిగ్గులచూపునిగ్గులన్
పెనఁగిననవ్వువెన్నెలలవెల్గుల హారతివెట్టి భర్తకున్
దనను సమర్పణమ్మిడి కృతార్థగ లోనఁ దలంచు మాటికిన్

# ప్రభాతము

## షష్ఠఖండము

ఈ మాని యెందాఁక నిటనుండునో యంచు
సోలినచూపు లుయ్యేలలూఁగ
ముని కనుష్ఠానవేళను వచింతమటంచుఁ
బైకొన్నతలఁపులుఁ బరుగులిడఁగ
నుపకారి నీ మాని నెపమేమిసూపి వీ
డ్కొనవచ్చునని జంకుగొంకు లెసఁగ
నితఁ డల్గినఁ భగ్నమే కదా యిపుడు సి
ద్ధించిన ఫలమంచుఁ దేజముడుఁగ

నొకరి నొకరు గనుచు నుబలాటపడుచును
మానిఁ జూచి సిగ్గు మాటుకొనుచు
నున్న యువతి యువకుఁ గన్నారఁగాంచుచు
యువకుపీపుఁ దట్టి యోగివరుఁడు.

మేలు, లెస్స, యింక మీతపస్సు ఫలించెఁ
బ్రణయరాజ్య మేలుకొనుఁడు పోదు
విజయ తెఱఁగు నెల్ల వింటిని మఱి నీదు
తెఱఁ గెఱుంగ కెట్లు తరలిపోదు.

అంచు నగిన యువకుఁ డానందపడి మాని
దివ్యవదన రేఖఁ దేరిచూచి
యన్న తలఁపుదగిలి హా! యంచు నిట్టూర్చి
కలఁగిపోయి బాష్పములను రాల్చి.

దఱిగనరాని దుఃఖభరితమ్ము విషాదమషీవిలేఖినీ
విరచితఖండకావ్య మిది విప్పి పఠింపు మటంచుఁ గొతుకీ
భరితుఁడ వయ్యె దీవు, తలపంగ మదగ్రజుఁబోలినందుకుఁ
గుఱుతుగఁ బూజ్యుఁడా! కటికిగుండెలునీవునుబొందియుంటివా!

భావ మెఱుంగనట్టి పసిబాలురమై నపుడాదిగా నొకే
భావముతోడఁ గూడి ప్రతిపట్టణమందెట కేని గాని పో
నీ విహరింపనీ కుడువనీ శయనింపఁగనిమ్ము లేవ ని
వ్వానికి విధి నున్నయన్నయకటా! విడనాఁడెఁగ ఠోరుఁడై ననున్.

ఆయనతప్పుగా దది, మదగ్రజునన్ని లేఁతనవ్వులోఁ
బూయని పూవు లేదు, వలపుల్ పచరింపని తావి లే; దిఁకా
ప్యాయమునీని తేనెతలిరాకును లే దది యోర్వలేని మా
నాయనగారి తప్పగును, నాదగుఁ దత్తనయుండ నౌటచేన్.

తనకత్తిమొన గుచ్చుకొనిపోని కుత్తుకే
లేనట్టి పగవారిసేన యొకటి
తనశాసనాక్షర మ్మనుదిన మ్మోంకార
విధిఁ బఠింపని ధరావిభు డొకండు
తనవాజిరింఖావిదారితమ్మై పోక
తెప్పరిల్లిన శత్రుదేశ మొకటి
తనదానవారిలో మునిఁగి దారిద్ర్యమ్ముఁ
గడిగికోనట్టి సత్కవి యొకండు

లేనె లేరని విందు మో మానిచంద్ర!
అతఁడు ముత్తాత మాకు దానార్ణవుండు
ఇరువదై దేండ్ల రాజక మ్మెసఁగె నందు
రతనితర్వాతఁ గాని నే నది సహింప.

బ్రహ్మదేశమ్ము మలయోర్వరాప్రదేశ
మెవని కే ప్రొద్దు నెగుమతి కెదురుసూచెఁ
బైఁడిమొహరీలు బస్తాలఁబట్టి యతఁడు
మాకుఁ బెదతాత శక్తివర్మప్రభుండు.

ఎవ్వాఁడు త్రికళింగ మువ్వెత్తుగా గెల్చి
బిరుదాంకభీముఁడన్ బిఱుదుఁబొందె
నెవ్వాఁడు నృపకామ నేలి ముమ్మడిభీముఁ
డనిన యన్వర్థాభిధను వహించె

నెవ్వాఁడు కుడ్యవర్మేంద్రుని౯ లోఁగొని
భూపమహేంద్రవిస్ఫూర్తిఁ దాల్చె
నెవ్వాఁడు వజ్జెమంత్రీశధీబలముతోఁ
త్రిభువనాంకుశుఁ డౌచుఁ దేజరిల్లెఁ

ప్రథితరాజరాజరాజకేసరివర్మ
పట్టిఁ గుండవాంబఁ బట్టమహిషిఁ
జేసి మించె నెవఁడు శ్రీవిమలాదిత్యుఁ
డాతఁ డౌను జిన్నతాత మాకు.

ప్రజలకోర్కులతీగ ప్రాకగ నాత్మీయ
చరితమ్ము చలువపందిరి యొనర్చి
ధరణియ౯ చిలుకకుఁదనకీర్తి జిల్గువ
జ్రాలుతాపినపంజరముగ దిద్ది
నిఱుపేదలనెడి వెన్నెలపుల్గులకు నిజా
భ్యుదయదయ౯ సుధాజ్యోత్స్నఁ జేసి
పగఱవెంజీఁకట్లపాలి కాత్మప్రతా
పమ్ము నఖండ దీపముగ నిలిపి

ప్రథితసకలాంధ్రవిపులసామ్రాజ్యచక్ర
మే మహాచక్రవర్తి పాలించియుండె
నతఁడు శ్రీరాజరాజమహామహుండు
నాకుఁ బెదతండ్రి నేను ధన్యాత్మకుండ.

నన్నపార్యుని భారతామ్నాయజలధి
స్వీయనారాయణాంశ బింబింపఁ జేసి
జాతిమతపోషణకళా ప్రశస్తగుణము
లుగ్గువోసెను నాతఁడాంధ్రోర్వికెల్ల.

అనుచు సోమదేవుఁ డంతరంగము పొంగి
యొడలుమఱచి నుడువుచుండ, విజయ
ప్రాణనాథు వంక మానినాథుని వంకఁ
దేరిచూచు జీవమూరినట్లు.

ఒకకంట నుష్ణబాష్పము
లొకకంటను శీతలాశ్రు లురుల ముఖకళల్
వికసింపఁగ ముకుళింపఁగ
నొకరీతిన్ మాని చూచుచుండెను వానిన్.

'అల లెగఁజిమ్ముకొంచును రయమ్మునఁ బాఱు నఖండగౌతమీ
కలకలనాదమున్ దరువుగాఁ గొని భారతసంహితార్థమున్
దెలుఁగునఁ బల్కినట్టి మహనీయుఁడు నన్నయభట్టు మాయశో
లలితలతల్ ప్రవర్ధిలఁగఁ బ్రాణరసమ్మును జిల్కె సన్మనీ !

దాని కెల్లను మా పెదతండ్రిగారె
హేతు, వంతటివానికి నే మనందు,
నన్నుఁ జూడ విజయాదిత్యజనవిభుండు
నన్నుఁ గన్నట్టి తండ్రి యన్యాయ్యరతుఁడు.'

అది వినఁగానె మానికి నయత్నముగాఁ గనుఁగోన లుల్కలై
సెదరెను జేవురించెను దృశించెను నాంతరవిప్లవాగ్నులన్
బ్రదుకుఁబోరన్ దహించెను బ్రభక్తిసుధాఘనసేకమెంతఁగన్
విదిపిన శాంతిఁబొంద నవి నిక్కముగాఁ జెయిదాటె వానికిన్.

మానివాలకమ్ము మానస మ్మెరియంగ
విజయ మెఱిఁగి యువకవీరుఁ జూచె
నాఁతఁ డతనిఁజూచె నాలోన మానియుఁ
దొంటియట్ల నిలిచెఁ దొణఁకకుండ.

'రాజరాజేంద్రచోడతనూజమైన
దివ్యగుణవతి యమ్మంగదేవియందుఁ
బెద్దతండ్రికిఁ దాను బ్రావిర్భవించె
నగ్రజన్ముఁడు చోళదేవాఖ్యుఁడోడ.

ఏను బుట్టితి మాతండ్రి కిట్టికష్ట
జాతకుఁడనై కళింగరాజ్యమ్ము నేలు
భూమిజానికి సోదరి పూతచరిత
త్రిపురసుందరి రాజ్యాంగదేవియందు.

కలుముల్ పొంగఁగఁ బాలుగారవసతుల్ గల్పించుమా దేశమా
తెలుఁగే, తేనియకండచక్కెరచవుల్ తేలించు మా బాసయా
తెలుఁగే, తొల్లిటిరాచవారిచెయిదుల్ దిద్దించు మా జాతియా
తెలుఁగే, మాదు తెలుంగుమేటిపసయుద్వేగించుమా శత్రులన్

చలమే పట్టినఁ దెగ్గువారు పులిమీసల్ వట్టి జాడించి యు
య్యాల లూపంగల దిట్టలన్న నుడి యన్వర్థమ్ముగాఁ జెల్లఁగాఁ
దెలఁగాణమ్మును వేంగిదేశ మని నిర్దేశించి, పేత్తంద్రి, పే
ర్వేలయన్ గట్టెను రాణ్మహేంద్రపురముర్వీముఖ్యధామమ్ముగన్

పడమరచాళుక్యులు నూ
కెడ తెగని విరోధులైరి యిటు నటుఁ గని సం
దెడసినఁ బైకొనఁ జూతురు
మిడుతలదం డట్లు ప్రతినిమేషము మమ్మున్.

పండ్లుపులిసెను జాళువాపసిడిగనికిఁ
గన్నుఁగుట్టెను ముత్యాలదొన్నెకొలకుఁ
గోరపులిమీసములమీఁదఁ గ్రూరభావ
ముదయమయ్యెను దెలుఁగుసంపద హరింప.

విక్రమాదిత్యుఁ డొక్కండు విజయసింహుఁ
డొక్కఁ డెంతేని గ్రౌర్యమ్ము పిక్కటిల్ల
వాఁడిచెడనట్టి బిఱుదు లవ్వారిమదము
తొలఁగిపోవదు నేఁటికిన్ గలికమంత.

మున్నొకనాఁడు వారలు సమున్నతదోర్బలమూ బలంగముల్
మున్నిడుకొన్నవారలయి పోటున కెత్తిరి రాణ్మహేంద్రసం
పన్నుల దొడ్డఁగొట్ట నది మా పెదనాన్న యెఱింగి పోటుకున్
నన్నహనమ్మొనర్చెఁ గనుసన్నల సేనలు ముందునడ్వఁగన్.

తెలుఁగుమగంటిమిన్ గోఱవిఁద్రిప్పినపోలికఁజూపి చివ్వలోఁ
దలపడు వారిమేటిజలతారుకిరీటపుటొదలల్ కసిన్
దెలుఁగుఁగటారికిన్ దొడిగి తెచ్చెను మా పెదనాన్నబిడ్డఁ డ
య్యలఘుమహాభుజుండలవియా! యొకమాత్రపువారెదుర్కొనన్

మదకలకరికుంభమస్తముల్ నఱికి త
ల్లలితోరుముక్తాఫలమ్ము లెనసి
ముష్టిపీడనసముద్భూతాత్మఘర్మాంబు
కణయుతయయి నట్లు క్రాలు తనదు

నసిలత నాకృష్ట యాౘును జయలక్ష్మి
యభిసారికావిధి నధిగమించి
వీరవక్షస్స్థలీవిఘటితకవచస
హస్రాంధకారమధ్యస్థ యగుచు

మత్తదంతావళకపోలమదజలాతి
రేకవృష్టులతోడ దుర్దినములైన
కదననిశలందుఁ దనుఁజేరఁ గడఁగు నట్లు
రణమొనర్చె మా పెదతండ్రి రాజరాజు.

మాదు తల్లులబంధుతామహిమవలన
రాజరాజేంద్రుఁడు కళింగరాజు మాకు
నుద్దవిడి సాయపడిరి రణోర్వియందుఁ
బశ్చిమచళుక్యసేనలు పలుచవాఱె.

సమధికానందతరుణీ లాస్యమ్మునర్పఁ
గదనసతి గళమ్మెత్తి మంగళము వాడె
విలిచికొనఁ జూచినది మమ్ము విజయలక్ష్మి
కీర్తికన్యక మముఁ గన్నుగీటనుండె.

కాని స్వదేశవీరబలిగాఁ దనప్రాణములొడ్డె వీరస
మ్మానితవిక్రమమ్మలసి మా పెదనాన్న, యరాతివీరసే
నానులభాగ్యరేఖ నటనమ్మొనరించిన దస్మదీయదుః
ఖానతమస్తకోపరి దురంతముతోడుత నాఁడు సన్మనీ!

విజయాదిత్యుఁడు నాదుతండ్రి యదిసంవీక్షించియానాఁడిఁకన్
విజయశ్రీపరిలబ్ధి కల్ల యని నిర్విణ్ణాత్ముఁడై పొందుకై
భజియించెన్ బగవారి, వారును జయప్రాప్తిన్ విశంకించి,దు
స్త్యజవాంఛల్ వెలివుచ్చి యొప్పి, రదిలజ్జాహేతు వీనాఁటికిన్.

అలిసె దళమ్ము లాలమున కాహుతులై దళవాయులున్ భువిన్
గలిసిరి నాదుతండ్రి యది కన్గొని మా పెదనాన్న బిడ్డనిన్
బిలిచి పరాజయమ్మునకు బెట్టిన నూఁకొనఁజేసె నింతయున్
దెలిసియు నేను నూఁకొనితి; దెల్గుమగంటిమి కద్ది మచ్చయా.

బంగారు మొహరీ లుపాయనమ్మని శత్రు
వీరాతివీరుల నోరుగట్టి
రతనాలరాసు లర్పణవెట్టి రాజేంద్ర
చోడభూవిభుని వా యోడఁజేసి

రజతముద్రలదొంతరలు సూపి తనతెన్గు
 మొనఖడ్గహస్తముల్ ముదువఁజేసి
యగ్రహారప్రదానాదికమ్మునఁ బ్రథా
 నామాత్యసుకవుల నాల్కలడఁచి

రాజరాజతనూజార్హరాణ్మహేంద్ర
కనకసింహాసనమ్మునా జనకుఁ డెక్క
వెలితిలేనట్టి ద్రోహమ్ము విలువగట్టి
తనశిరమ్మునఁ బులుముకోఁ దలఁచి యపుడు.

అది కనుఁగొన్న యగ్రజునియక్షుల శోకవిషాదబాష్పముల్
నదులయి జాలుగొన్నవి, వినమ్రములై కనుఱెప్ప లావడల్
పొదికొని లాగినట్లు దిగిపోయిన, వాస్యములోఁ గళాద్యుతుల్
పెదవులమీఁద మ్రొగ్గిన నిరీహకు మ్రగ్గిన వగ్గిగొన్నటుల్.

అపుడు త్రికళింగభూవిభుం డాగ్రహించి
నిండుసభలోన నాతండ్రిదుండగమ్ము
బాహిరమొనర్చి దూషించిపలికినాఁడు
నోరులేనట్టి నా కవు నోరువచ్చె.

పొదపయి నగ్గిసూడి నిలుచున్నశవమ్మనటు లేచి తత్సభా
సదులు కనంగ నీ యసిభుజంగిని దూసితిఁ దండ్రిపైకి, నే
నది సభయంచుఁ గాని మఱియాతఁడుతండ్రియటంచుఁగానినా
యెద నపు డెంచలేదు, పని యేమిటి సత్యముపట్లఁ దాల్మికిన్

దీని కానాఁడు నాతండ్రిప్రాణవాయు
లాహుతించియె యుండు, నాయగ్రజుండు
తనదుపినతండ్రి కంఠలుంఠనకు బదులు
నిజగళమ్మును నడ్డమ్ము నిలుపకున్న.

విరియఁబూచిన నాతండ్రిభీకరంపు
టరుణనేత్రాలలోనఁ బ్రత్యక్షమయ్యె
భ్రాతృభావమ్ము మాది దుర్వారమయ్యెఁ,
ద్రుటిని విడివడనున్నపూఁదీవలట్లు.

తండ్రిని దూయఁబట్టిన విధమ్మది నేఁటికి నాయెడందలో
గాండ్రనిపించు నీ యొడలు గగ్గురుపాటువహించుఁ గన్నులన్
జండ్రలతోడినిప్పుకలు జ్వాలలుచెండు విషాదరోషముల్
తీండ్రిలుచుండు నెన్నటికి దీనికి నాఱుట గల్గనున్నదో?

నాకు నాయన్నగారికి నాఁటఁగోలె
దర్శనము సున్నయై పోయె, ధరణివిభుని
చండశాసన మారీతి జరిగె, నాఁటి
కన్నదమ్ములు వేఱుసేయంగఁ బడిరి.

ఈయమ నాకోసము నే
నో యగ్రజునికోస ముభయుల మకటా!
యీ యటవిని దిరుఁగాడఁగ
నీయమ ఫలియించె నేను హీనుఁడనైతిన్.

తట్టితిఁ దల్పుదల్పుఁ, బరితాపముతోఁ బెనుమంటడొక్కతో
గట్టినబట్టతో మలినకాయముతోఁ దెగమాసిపెన్జడల్
గట్టినజుట్టుతో మొఱికికంచుకధారణతోడ స్నాన మే
పట్టునెఱుంగ కేను బ్రతిపట్టణ మందును నగ్రజార్థమై.

ఈ మహాక్రూరవనమృగస్తోమభయద
భద్రగిరిసానునిర్ఝరీప్రాంతవనుల
వెదుక మొదలిడి మూఁడేండ్లు వెడలిపోయె
నగ్రజునిజాడ దొరకక దావంతయైన.

నిన్న మాపటివేళ నాస్నేహితుం డొ
కండు కన్పించి యా యుష్ణకుండసీమ
నాదు మొఱవిని లాలించి యాదరమున
నీ వనీప్రాంతములకుఁ బంపించె నన్ను.

ఏను నీ ప్రాంతవనులకు నేగుదెంచి
యగ్రజన్ముని వెదకుచు నలసిపోయి
యొక్కచో నిల్చి యాలించియుంటి నపుడు
భయదమైనట్టి యార్తరవ మ్మొకండు.

అప్పు డుఱుములు పిడుగులు నడరుచుండె
నైన నాయార్తరవముకై యరయఁబూని
తెల్లవారులు దిరిగి యీ దీనురాలి
నిచటఁ బొడఁగాంచి నే విడిపించినాఁడ.

మీఁదన్ దమ దర్శనభా
గ్యోదయమును నయ్యె నిచటఁ, గొఁదువే యిఁక సౌ
ఖ్యోదయమునకున్ మునిచం
ద్రా! దయ లే దగ్రజునకు నది దుర్భర మా.

అనుచు నుస్సురనెడి యా సోమదేవుని
యాస్య మరసి మునిముఖాంబుజమ్ము
కలఁగుఁ గాని తన్నుఁదెలుపఁడు వగలోనఁ
దిరుగఁ గోశగతము తేఁటిబోలె.

యువకుఁ డపుడు విజయ నోరగంటను గాంచి
యగ్రజుండు విడిచినట్టి వట్టి
నీరసుం డితండు నిర్భాగ్యుఁ డీతఁడు
దొరుక నేమి ఫలము దొరుకు నీకు.

ప్రణయపూజ నెట్లు పాల్గొనఁ గల్గును
వట్టి యున్నదుం డభాగ్యురాల
వీవు నంచు నామెవీక్షించి యతఁ డేచ్చె
నతనిఁ జూచి యామె యావురనియె.

వారిఁ జూచి మాని పాషాణశిల్పమై
కదలమెదలలేక కరఁగిపోయెఁ
దన్నుఁ దాను దాఁచుఁ దప మేల మానికో
సమయభంగ మైన జన్మ యేల ?

# ప్రభాతము

## సప్తమఖండము

అపు డటఁ ద్రెల్లియుండిన భటాదులలో నొకరుండు చాక తా
నుపగతజీవుఁడై తెలివినొంది మహాసలిలార్తిఁ గుందుచున్
దపతపలాడుచున్ బెగలి తాపసివంక నిగిడ్చి దృష్టి ని
స్త్రపుఁడయినోటఁ గేల్ కదిపి ధాహమటంచునుగూసెబిట్టుగన్.

ఉలికిపడి చూచి, మేనులు
జలదరిలన్, గొండవాగుజలపూరము దో
యిలి యిడి యొకరొకరుగఁ ద
త్సలిలార్తుని ద్రాపి వారు దండనునిలువన్.

వడవడవడఁ కెడి పెదవులఁ
దడఁబడుమాటలను మఱ్ఱిదఱిఁ జేరగిలం
బడ నాసీనుని దనుఁ జే
యుఁడటంచున్ నుడివె నాతఁ డుమ్నదపడుచున్.

అటులఁ జేయ వార, లాతఁ డొక్కించుక
విశ్రమించి కనులు విచ్చిచూచి
దాహ మడిగి మఱలఁ ద్రాగి నిదానించి
సోమదేవువంకఁ జూపుఁబఱపి.

ఒక్క పొడిదగ్గుదగ్గి, యా ప్రక్కనున్న
విజయవంకను గాంచి లోవెగటుతోడ
దద్ద మూలిగి, యామీఁదితపసివంక
దృష్టి పై కెత్తి నొసలు చిట్లించి చూచి.

చేతనాజ్యోతి తనలోనఁ జేరి పైకి
నిగిడినట్టులఁ గలకలఁ నగుచు మెరసి
గౌతమీతీరపర్ణశాలాతపస్వి
వీవు కాదటయ్య! మహానుభావ! చెపుమ!

ఈ లలన మీరు గొనితెచ్చువేళ, వచ్చి
మీకుటీరమ్ములోపల మేము నుంటి
మపుడు, మీయిర్వురనుజంపనగునటంచుఁ
దలఁచుకొంటిమి లోన పేరలుక నిగుడ.

మీదయాపూర్ణవదనబింబితమహస్సు
లోఁ దపోజ్వాల యొకటి మామీఁది కుటికె
నపుడు దానిలో మాకుఁ బ్రత్యక్షమయ్యెఁ
జోళదేవాస్యలక్షణజ్యోతి యొకటి.

వడఁకిపోతిమి మీకాళ్లఁబడఁ దలంచి
తిమి, యదేమిటో కాని, సందేహ మలమ
మిమ్ముఁ బోనిచ్చి పొంచి యీ మెలఁతఁ దెచ్చి
నార మిచ్చోట నీపాటు సేరె మాకు.

కటికికసాయికోఁత యని కాని తలంపక కూటనీతి క
క్కట పయికొన్న మాదృశజగత్కుటిలాత్ముల కిట్టిపాటు క
ల్గుట యుచితమ్మె,మెచ్చునది లోకము,దైవము,కాని తన్మహ
కుటిలుని కేల కల్గ దిది; కోర్కి ఫలింపదు హాకు నీజనిఁ.

ఆ యనఘాత్మకుండు కరుణాంబుధి సజ్జనరంజకుండు స్వ
ర్గీయుఁడు రాజరాడ్విభుఁడు లేఁడని యాతనిముద్దుబిడ్డఁ డా
మా యువరాజు మాన్నృపకుమారుఁబురిఁ వెడలంగఁగొట్టి య
న్యాయుఁడుపిన్నతండ్రియకటా!మనియుండునొయెన్నినాళ్లిఁకఁ

పిఱికి యీతఁడు తనచేతఁ బెద్దకత్తి
పట్టెనే కాని యెదురుగా వచ్చెనొక్కొ?
పొంచి మమ్మును గొట్టి యీ పొలతి నిచట
దాను రక్షించె నిది యభిమానిగుణమె?

చెనఁటి నీ చేడె దాఁచి మీ చెంత కేము
తిరిగివచ్చి మాదైన సందియముఁ దీర్చి
కోఁ దలంచితి మది యొనఁగూడలేదు
దైవ మెంతెంతలేసికిఁ దగఁడొ? పూజ్య!

ఈ చెనంటిని మీరె రక్షింపఁబూని
వెడలితిరటయ్య ! యెంతగా బడలినారొ !
మీరు మాచోళదేవులు కారొ ? యతని
నేను నీ జన్మలోన దృశింపలేన ?

ఓ మహాపూజ్య ! మీ ముఖజ్యోతిఁ జూచి
యతనిఁ జూచినయట్లె నే నలరుచుంటి
నాతఁ డీ భద్రగిరివనీప్రాంతమందె
యడరు నట మానినై మీర లతనిఁ గనరొ !

ఎప్పు డే మీకుఁ గన్పించు నెడల స్వామి !
మీచమూనేత వెదకుచు మిమ్ము నీ య
రణ్యమధ్య మం దీ రీతిఁ బ్రాణములు త్య
జించె నంచును మీరు విన్పింపఁగలరొ ?

నిజము మద్వార్త మీరు విన్పింపఁగలరు
అంతవిశ్వసనమ్ము మీయందు నేల
నో జనించుచున్నది నాకు, నో మహాను
భావ ! చోళదేవేంద్రుఁడ వీవు కావ?

అక్కటా ! విజయాదిత్యుఁ డంతపనికిఁ
జొచ్చునే యగ్రజాత్మజుఁ జోళదేవుఁ
గనికరము లేక హింసింపఁ గాఁబొనునె?
యుర్వి యూఁగొట్టి యది యెల్ల యూరకొనునె ?

రాజరాట్త్రల్ల జుఁడు యుద్ధరంగమందు
మేను దొరఁగుచు మమ్మ్నలం బిలిచి తనదు
పట్టి మాచేతఁ బెట్టునో! ఫలము నిట్లు
కలుగునో! యంచుఁ దనచేతికత్తి నెత్తి.

తినరాదా! యువరాజు నిష్కపటి వద్దే వద్దటంచుఁ వచిం
చెను గాదా! తనకీ యనాథవిభవశ్రీకూడు, దాఁ గేవల
మ్మ్నను సన్యాసము స్వీకరించినటు లుద్బుద్ధుండు నౌ,తద్వివా
సనమేలా? ఘటియించిమాధృశులకాజన్మమ్ము దుఃఖమ్మ్నడఁ

తేరకుఁ దక్కెఁగాఁ దనకుఁ దియ్యనిరాజ్యసుఖమ్ములంచు నో
రూరఁగ మెక్కఁజూచు టదియొప్పును గా, కిఁక నెంగిలాకుపై
గాఱుకొనంగ దూకి మునికాళ్లిడి కోఱ లగల్చి కర్తపైఁ
బోరెడి కాట్లకుక్కవిధముఁ సహించుపఁగవచ్చు నేరికిఁ.

స్వామీ! యెన్నఁడుభోగసమ్యగను భావాభావముల్ జీవి,కా
శామాలిన్యదవాగ్నిలోఁ గుమిలి నాశమ్మౌటకే చూచుఁ గా
నీమాన్యమ్మగుమోక్షరాజ్యమునకై యేయత్నమున్ జేయువాం
ఛామాత్రమ్మును జూపఁడీ కుటిలనై జస్వార్థ మే మందునో?

వ్రతులై ప్రేమరమాసుధాదృఢపరీరంభార్థులై తాము జీ
వితసర్వస్వము ధారవోసికొని జీవింపంగ నూహించు సా
ధుతపస్వంతుల వంటివారిపయిఁ గత్తుల్ దూయు నీ లోక, మీ
గతికిఁ నాహృదయంబు మండెడుఁ ప్రతీకారానలోత్తప్తమై.

పరకేసరివర్మను మీ
రెఱుఁగుదురో! తన్మహీమహేంద్రునకుఁ గూఁ
తు రమాబాల మహాసుం
దరి వినియుండెదరు మీరు తాపసులైనన్.

ఆ త్రిలోకైకకామనోజ్ఞాత్మ వలచె
రాజరాజకుమారచోళ ప్రభువరు
నామెలావణ్యమధుపిపాసాప్తితోనె
ఆతఁడును జీవములు నిల్పె నహరహమ్ము.

అమలకోమలదంతకుట్మలములు తడివి
చిఱుతనునువంపు నీలిముంగురులఁ దువ్వి
కలికిపనిగొన్న మేల్మిజూకాలు కదిపి
శైశవానంద ముమకు నా లలితుఁ డొసఁగె.

కలికి తెలివాలుఁగన్నులు కదుపునపుడు
లలితదరహాసచంద్రికల్ తొలఁకునపుడు
పలుకుపలుకునఁ దేనియల్ చిలుకునపుడు
చోళదేవేంద్రుఁ డామెలో వ్రేలువాఁడు.

నీతిశాస్త్రము మథియించు నిపుణదృష్టి
ఘనమదాంధుల విదళించు కఠినముష్టి
సాముగరిడీల కంగసౌష్ఠవముపుష్టి
వారలకు బాల్యదేవత వర మొసంగె.

సత్వజవనాశ్వముల నెక్కి స్వారిచేసి
కత్తులను ద్రిప్పి ఘనకార్ముకముల వంచి
దూరసంచారిలక్ష్యముల్ తూలనేసి
వార లొకరి కొకరు ఋణపడినవారు.

సురలనయనాలు పూఁదేనెసోన రాల్పఁ
బ్రజలనేత్రాలు మోదబాష్పములు రాల్ప
సమదనృపదృక్కు లగ్నిఖండములు రాల్పఁ
బెరిగె హృదయాల వారికిఁ బ్రేమవల్లి.

అరుల కవిభేద్య మచ్ఛేద్య మగుచు వెలయు
వారి ప్రేమోరువల్లిని దేరిచూచి
కటకటఁ విజయాదిత్యకుటిలుఁ డకట
కత్తిరింపంగ లోలోనఁ గడఁగినాఁడు.

అమలగుణఖని మధురకల్యాణకళికఁ
దళుఁగు లేనట్టి తళుకుముత్యాలకోవ
జీవమూడినబంగారు జిలుఁగుఁబ్రతిమ
నతఁడు కై సేయఁదలఁచెను సుతుతురాయి.

వెలితియే లేని సోగజాబిల్లితునక
విద్ధమే కాని లోకప్రసిద్ధమణిని
భువనభవనోజ్జ్వలస్నేహపూర్ణకళిక
నందనుశిరఃకిరీటరత్నముగఁ గోరె.

ప్రవిమలానందపీయూషరసముబుగ్గఁ
బుష్పితప్రేమచై తన్యపుష్పలతిక
నళుఱెఱుంగని శోడశకళలగుత్తిఁ
గొడుకుబొమిడికఁ దోడవుగాఁ గూర్ప నెంచె.

కటికిదైవమ్ము చేఁత లెంతటికి లేవు
దోసకారులకే చాలఁ దోడుపడును
న్యాయ్య మన్యాయ్య మనుకొని యడలువారె
మోసపుజగత్తులోన వాపోవువారు.

సింహశార్దూలముల నొక్కచిటికెలోనఁ
బట్టిపల్లార్చఁజాలు తత్ప్రభుసుతుండు
కిమ్మనక నిందుసభనుండి గెంటఁబడెను
అకట! దుర్దశ యెరికే నగునె? యంత.

విషవిలిప్తంపుటసితోడ వెడలివచ్చి
ప్రభుకుమారునిపైకిఁ గాల్వాఱపినట్టి
దుష్టవీరుండు పినతండ్రి కిష్టుఁడయ్యె
ద్వేషమెఱుఁగని యువరాజు ద్విష్టుఁడయ్యె.

రాజ్యలక్ష్మిని నిజగేహలక్ష్మి నకట !
కొడుకునకుఁ గూర్చు పినతండ్రికూళపనికె
చోళదేవుండు తనవీడు సురిగిపోయె
లేకయుండిన నసువులే లేకయుండు.

అకట ! నడురేయి నెవ్వరే నరయకుండఁ
బంపఁబడినాఁడు చోళదేవప్రభుండు
పంపఁబడినాఁడొ లేకున్నఁ జంపఁబడెనొ
ఇల దొరతలఁచుకొన్న దెబ్బలకుఁ గొదువె?

తల్లిదండ్రులు లేని నిర్ధనికుఁ డాత
డెందు కన్నీరు నించుచుఁ గుందువాఁడొ
యే మహావాయువులలోన నెగసిచనెనొ
తనకుఁ బినతండ్రిమా టమృతంపుటూట.

అకట ! విధిచేత లేమని యనఁగవలయు
సర్వసర్వంసహాచక్ర సార్వభౌమ .
పదవి వెలుఁగొందఁ దగినట్టి ప్రభుసుతుండు
బక్కచిక్కిన నిఱుపేదఁ 'పాప' మగునె ?

చోళదేవునిపదతలి సుతుఁడు తాను
కుడిచికూర్చుండ కెంతటి కూళయయ్యె,
నెవ్వఁ డొసఁగె నీ యధికార మితని, కాను
దిన్న యింటివాసాలను నెన్నవలయు.

అతఁడు పరకేసరీంద్రు సమక్షమునకు
రమణి నుమఁ గోరి రాయబారమ్మునంపెఁ
బరిణయవినిర్ణయసమగ్రబహువిధోప
కరణసంభార మిచ్చి యఖండరీతి.

మొదటఁ బరకేసరిప్రభుం డెదఁగరంగి
చోళదేవున కిడ సుమాబాల నెంచెఁ
గాని యాతనిదౌర్భాగ్యకాండ చెవుల
సోకి యా రాయబార మంగీకరించె.

ఆ మహాసాధ్వి యుమ యాయుదంత మరసి
యెటకొ పయనించె నెవ్వరే నెఱుఁగకుండ
మంచిచెడుగులు కల్పించి మాటుపఱచి
ప్రకృతిఁ దైతక్కలాడించు ప్రభువు లేఁడొ?

కలుషమే కాని సుకృతమే కాని జగతిఁ
దరుణపరిపక్వ మొందక తఱుఁగఁబోదు
కఠినుఁ డావిజయాదిత్యుకర్మఫలము
పండిపోయిన దిఁక రాలిపడును నిజము.

కడుపులు తఱుగుకొని పోవఁ గాంచి కాంచి
విసిఁగి వేసారి మాబోటు లుసురుమన్న
రాజరాజనరేంద్రుని రాజ్యలక్ష్మి
నిలువనేరదు తద్ద్రోహితలను నిజము.

ఈ నడిసావు నచ్చి యిటనే పడియుండిన యీ వయస్సుతో
నే ననినాఁడ నాయెడఁద నిహ్నుతమైన దవాగ్నికీల యీ
ర్ష్యాసముద్రగమై నిగుడ రాజ్యముగుట్టు లెఱింగియుంటచే
రోసము రేఁప బశ్చిమచళుక్యులపాలికి ద్రోహిబుద్ధినై.

విజయసింహవిభుఁడు విక్రమాదిత్యుండు
రాణ్మహేంద్రనగరరాజ్యతంత్ర
మాలకించినార లమితసైన్యమ్ముతో
రేపొ మాపొ వత్తు రేపుమీఁటి.

అనిమదిఁబొంగుచునాతఁడు
వినిపింపన్ మానిముఖము వెలవెలపోయెన్
గని సోమదేవుఁ డయ్యెది
ఘనరోషవిషాదరేఖ క్రమ్మ ముఖముపై.

ఎంతటి కూళవైతి, మది హెచ్చిన కోపదవాగ్నికీలకున్
సంతస మిట్టులా రిపువశమ్మొనరించుట దేశమాత, ను
ద్భ్రాంతమనస్కుఁడా! రిపుశిరఃకరటివ్రజకుంభపాటనో
ద్వాంతమణీఘృణీవిలసదాంధ్రకృపాణము మొక్కవుచ్చితా?

నీ కరఖడ్గకాళికి ననీకబుభుక్షను దీర్పలేక, లుం
టాక! స్వదేశపాత్రికమెడన్ బలివెట్టితె, తెన్గునెత్తుటన్
జీకిన నీకు నీ పనికి సిగ్గు జనింపదె, తెన్గువారికిన్
లోకమునవ్వఁగా హృదయలూనకళంకము తెచ్చిపెట్టితా?

ఇది భక్తియ యిది వినిన్
మది మెచ్చునఁ జోళదేవమాన్యుఁడు నిన్నున్
దుదమొదలు తెలియకుండఁగఁ
బదనగు నసిఁ దఱుఁగ నింత పాపము వ్రానే.

అనినఁ బెల్లన నగి వాఁ
డను, గానన్ నీవు పొంచి యడరితి విట నో
మొనగాడ! నీదునాకృతిఁ
గనిపించును సోమదేవుకటుచిహ్నములున్.

సత్యము రేపే విజయా
దిత్యుఁడు తత్సుతుఁడు సోమదేవుఁడు సంయ
న్మృత్యుభయదదంష్ట్రార్చికిఁ
బ్రత్యగ్రేంధనము లగుచు భసితము లగుతన్.

అన సోమేశ్వరుఁడీతఁడే పరమలుబ్ధాగ్రేసరుం డగ్రజ
న్మని రాజ్యచ్యుతుఁజేయు తండ్రిపనికామోదించిప్రాణమ్మువా
యనిపాషాణము, నీ కళంకకరవాలాగ్రమ్మునన్ గ్రుచ్చియె
త్తినవీనిన్ శమియించుఁబాపమెదిక త్తీ యొత్తుమా!యోధుఁడా.

అని సోమేశ్వరుఁ డా భటు
ని నిశితతరవారి కెదురునిలిపి వెడదతో
మ్మును గూరుచుండె మోకా
ళ్లను మడిచి పొడువు పొడువు తలంగక యనుచున్.

భటునిపుటపాకకరుణాప్రపంచమందుఁ
బ్రణయమరోన్మపఘాతిహర్మ్యమ్మునందు
విపులనై రాశ్యఘనసింహపీఠియందుఁ
గలలు గనుచున్న ముని యట్లె కలఁగిలేచి.

నిలుపుము భటుఁడా కత్తిని,
దొలఁగుమ తమ్ముఁడ! యొకింత దుర్భరము మహా
ప్రళయ మ్మితఁడే చోళుఁడు
నిలుపుమ! యని చేరెఁ దాను నికటస్థలికిన్.

ఆలో నక్కసి తీరగా భటుఁడు చింతాకంత జంకొంద కా
భీలాసిన్ గరకంపనమ్మునఁగఁ దద్వీరోరువక్షస్స్థలీ
మూలాలక్ష్యతదాయనయ్యది వెసన్ మూర్ఛమ్మునన్ వ్రాలియు
త్తాలాఘాతమునాఁగి మిట్టుచునెడందన్ నాటెగాయమ్మగన్.

తలపై దెబ్బకు ఱొమ్మున
తొలచినగాయమ్మునకును మ్రొగ్గతిలుచు దు
ర్లలితుఁ డతఁడు స్మృతితప్పెన్
గలంగిపోయె విజయ ముని గడగడలాడెన్.

అకటా! యోధుఁడ! చోళదేవుఁడితఁడే, యన్యాయివై తీవు, ఘా
తుకకృత్య మ్మొడికట్టినావు, విజయా! దుర్మార్గ, దుశ్చింతు, ధూ
ర్తకు నీ చోళుని జోగిగాఁ దలఁచి సంతాపాగ్నితప్తాజ్యకుం
డిక వ్రేల్చంబడినావు జీవములతో డీకొన్నదై వీగతిన్.

అనుచుఁ జోళవిభుఁడు హాహారవమ్మున
ననుజునాస్యమందు నాస్య ముంచి
తలను బుజము చార్తిఁ దనువును నిమురుచు
నొడలు తెలియకుండ నడలుచుండ.

హాంత యప్పుడు 'చోళదేవా! మహాత్మ!
నీవ? నీవా? యటంచుఁ గన్నీటికనుల
విస్మయానందమధుజ్యోతి వెలయఁ గనుచు
దివ్యతరనిదిధ్యాసనదృష్టితోడ.

రక్తసిక్తాంగశిథిలాంబరములతోడ
బండిచక్రమ్ముపగిదిఁ దద్భటుఁడు దొర్లి
విభునిపదములపై వ్రాలి విడిచె నుసురు
లతితరానంద మెంతటి హానకారి.

స్మృతితొలంగెను దమ్ముండు, స్మృతితొలంగి
ప్రాణములు వాసె విశ్వాసపాత్రుఁడైన
భటుఁడు, తనకోస మా యిర్వు రటుల నగుట
గోటిచుట్టున రోకంటిపోటు గాఁగ.

నిత్యమై వెలుఁగు నీ ముత్యాలజాలెలోఁ
        గలవొకో నీలిపూసలును దండ్రి!
చలువమై వెలయు నీశ్వాసలతావిలోఁ
        గలవొకో వేఁడిగాడ్పులును దండ్రి!
యనఘమై తనరు నీ యార్ద్రింపుఁజూపులోఁ
        గలవొకో చండ్రనిప్పులును దండ్రి!
హాయిగా వ్రాలు నీ యమృతవాగ్వృష్టిలోఁ
        గలవొకో పిడుగుపాటులును దండ్రి!

యమృతహస్తానఁ బ్రణయరాజ్యము సృజించి
ప్రణయులను గూర్చునట్టి నీ పనులయందుఁ
గలవె? కో మృత్యురాజ్య మొక్కండు సూపి
మఱల విడఁదీయు నిట్టి కర్మలును దండ్రి!

నాదు పితృవ్యరుణ్మయగుణమ్ము మదాత్మను శృంఖలించి త్వ
త్పాదసమక్షమందుఁ బడవైచెఁ బిగించియుఁ జూచితీవు, తం
డ్రీ! దిగజాఱఁ దీసికొన నేను యతించితి నంచు రాత్రి, నీ
వీ దయలేనికృత్యమున కీ విధిగాఁ జెయిఁ జేసికొంటివా?

అది నీచిత్తము దేవా!
యిది నాభాగ్యమ్మ దేవ! యేమని ధ్యానిం
చెద నిఁక దేవా! యని
హృదయావేదనమునన్ మునీంద్రుం డుండన్.

విజయాశోక మహాబ్ధిఘోషములకున్ విశ్వమ్ము మారోగ్రిగె, భూ
మిజవట్లాడె,వణంకె భూధ్రములు, స్తంభించెన్ మరుత్తుల్,దిగం
తజగీషామతి వీడె నర్కుఁ, డుదధుల్ తారాణి ఘూర్ణిల్లె, ది
గ్గజముల్ బొబ్బలువెట్టె ఘీంకృతులతోఁ గల్పాంతమైనట్లుగన్.

అకట! విజయకు జీవిత మంతమయ్యె
నామెహృదయాటవికిఁ జిచ్చులంటుకొనెను
డిల్లవడి గుండెలట్టె గుభిల్లుమనియె
భావములు మందగిల్లి వెన్నరువు లెక్కె.

అసురుసురువుట్టె నాత్మకు విసుఁగుదోఁచె
మేను పసిచెడెఁ జూపులమిణుకు లాఱె
నవయవమ్ములు దడదడలాడి పోయెఁ
దెలియరానట్టి దుఃఖంపుటలల మునిఁగె,

జారి దేహానమూఁగిన జటలతోడ
నిలువు నీరునఁ బాఱు కన్నీటితోడఁ
జెదఱి గాలికి దూగు పై చెఱఁగుతోడఁ
దడఁబడుచు నున్న లేఁతపాదములతోడ.

ఉర్వి నంటిన ఖుటియూడ లూఁతఁగొనుచు
శోకదేవత తానె యచ్చోటి కపుడు
తరలివచ్చిన పగిదిగాఁ దరలిపోయి
ధవునిపై వ్రాలి వాపోయెఁ దరుణి మిపుల

పుట్టిననాఁడె యమ్మ చనిపోయెను, నెత్తురుఁగందుఁ బొత్తులన్
బెట్టియు నింత నంత నను బెంచెను దండ్రి, తదేకపుత్రినై
పట్టినదెల్ల బంగరుగ భాగ్యముతోఁ దులఁదూఁగియుంటి, నేఁ
డుట్టికి మూఁడుసేర్లు తెగి యూఁగితిగా హృదయాధినాథుఁడా!

ఆ చెవిగాలి యీ చెవి దహద్దహదగ్నిశలాకరీతిగన్
వీచినరోజునన్ గగనవీధి నహఃపతి నిప్పువెట్టి చే
యూఁచినరోజునన్ సికతోర్వ్యలధూళి తుపాకిరవ్వగా
లేచినరోజునన్ బ్రదికి లేచిన దీ దురవస్థకా ప్రభూ!

అకట! విరహాభరమె యానందమై తోఁచె
మరణదుఃఖభర మమాంతమిపుడు
గుండెఁ గొఱికి నన్నుఁ గూలిచె నంచామె
చేలచెఱఁగు మోముఁజేర్చి యేడ్చు.

అదివినినాఁడో లేదో మునియచ్చటఁదమ్ముని ఱొమ్మునెత్తురుల్
గొడగొని ఁ త్రాగుకత్తిపయిఁ గూరినచూపులు త్రిప్పలేదు, నె
మ్మదినడలింపలేదు, మృదుమార్గమునన్ వెలివుచ్చికత్తి యా
ప్రిదిలినయట్టిగాయమున ఁ వ్రేల్చిడి నెత్తురు లడ్డుకట్టుచున్.

ఓషధీరసమ్ము లూర్జితశక్తులు
మేళగించి యొడితిమీఁద నిలిపి
కాసెఁ జించికట్టి యొాసరిల్లినతమ్ము
నాస్యమందు గప్పె నార్ద్రపటము.

ఇంత నంతఁ గదలి యిటు నటు మెదలుచు
నెఱుకఁగాంచెఁ దమ్ముఁ డింత గడువ
లోకబంధుఁ డపుడు ప్రాకుచు మెలమెల్ల
మింటినడిమిరాజ్య మేలుకొనెను.

అచటఁ ద్రెళ్లియున్న యాయుధపాణుల
కటనె దహనకర్మ లాచరించి
కావిచీరడోలిఁ గైకొని తమ్ముని
దపసి విజయుతోడఁ దరలెనపుడు.

సీతమ్మ నీరాడి చీర లారనుబెట్టి
కొన్నట్టి చాపఱాగుట్ట దాటి
తమి నామె పసుపుఁగుంకుమముద్ర లుంచిన
లలితపీతారుణశిలలు దాటి

మురిపంపుమాయబంగరులేడిడెక్కనొ
క్కలు గల్లు పాలఱామలలు దాటి
గారడీతబిసిరక్కసికాలిముద్రలు
నిలిచిన పాషాణతిలలు దాటి

పంచవటిలోన శ్రీరామభద్రమూర్తి
మున్ను వనవాసమున నిల్పికొన్నయట్టి
పర్ణశాలసమీపభూవనులు దాటి
ఘనవిషాదమ్ముతో వారు చనుచునుండి.

చండాంశుఁడయ్యు మార్తాండుండు జాలితో
నెడ నెడ మబ్బులగొడుగు లుంచఁ
గ్రూరజంతువులయ్యుఁ గ్రోల్పులుల్ గుహలలో
గుటకలమేరితో గోడు గుడువఁ
జపలచిత్తములయ్యు సారంగముల్ దయఁ
నీటిపట్టుల దృష్టినిల్పి చూడఁ
బక్షపాతములయ్యుఁ బతగముల్ చెట్లపై
ముక్కులు తెఱచి వాపోవుచుండ

ప్ర భా త ము

భద్రగిరిభీకరాటవీప్రకృతి కూడఁ
బవనపూరితవైణవీ వివరజనిత
భూరిశోకధ్వనిక్ సానుభూతి నిడఁగ
నాశ్రమమ్మును జేరఁగా నరిగినారు.

తత్ప్రియాపూర్వదర్భసంస్తరణమందె
తన్మృగాజినమందె యాతని శయింపఁ
జేసి యుపచారములు పెక్కు సేయుచుండె
విజయతోడను మాని నిర్విణ్ణుఁ డగుచు.

# ప్రభాతము

## అష్టమఖండము

గరగరగాఁగ ఱొమ్మువయిఁ గ్రమ్మినగడ్డము బుగ్గమీసలున్
బొరిఁబొరి బొమ్మలన్ బెరిగి ముందుకు మ్రొగ్గిన సోగవెండ్రుకల్
మురువగు నిల్వుటంగి నడుమున్ బిగిగొన్న పసిండికాసెయున్
గరముల డాలు కత్తి వెలుఁగన్ రణజృంభితవీరమూర్తియై.

తురగ మెక్కి యోధవరుఁ డొక్కరుఁడు వచ్చి
పర్ణశాలయెదుట బడబ డిగ్గ
సోమదేవుసేవలో మేళగిలియున్న
విజయ చోళపతియు వెఱగుపడిరి.

వెఱపడి యంతలోఁ దెలియువేళ 'జొహారులు, స్వాము లేలనో
తొఱఁగిరి మోముకాంతులను,దొల్లిటివాలక మాశ్రమమ్ములో
గలవయి నట్లు తోఁచు,మునికన్యక యీ విజయాకుమారి మీ
దఱి కరుదెంచెనా హృదయదారక మీమెచరిత్ర మెంతయుఁ

ప్ర
అనుచునుండ విజయ యతనికి మ్రొక్కఁగా
భ వింతసన్నతోడ విజయఁజూచి
బః ముదిత! నీకు నేఁడు మొదలుగా సుఖమబ్బు
భు నమ్ము మంచు నాశిషమ్ము నిడుచు

నా ఈమృగచర్మమందుశయనించినఈతఁడెవండొహోహో! మా
సోమకుమారుఁడా! వెదుకజూచిన మువ్వురు నొక్కచోటనే
తః తామె లభింత్రుగా మిగుల ధన్యుఁడ నంచు వచించు నాగత
తః స్వామికి మాని దీవన లొసంగుట మర్చెను బూర్వరీతిగన్.
జ్జే

మఱచి మృగాజినమ్మునఁ గు
మారిలుచున్ బధికావనీపతిన్
దఱచు దృశించుచున్ దన కృ
తజ్ఞతఁ దెల్పికొనంగ లేవఁగా
దొఱకొనుచున్ జోహారుకయి
దోయికి యత్నమొనర్చుచున్ వృథా
భరుఁడగుతమ్మునిన్ ముని కృ
పావ్రణితుండయిచూచుచుండఁగన్.

ఓ సోమదేవ! యా యుష్ణకుండము చెంత
నీకుఁ జెప్పినది సరిదాఁకె కాదె?
యేడేండ్లనుండి నే నీ మహామునివర్యు
పాదపూజకు వచ్చి పోదు, నీమె

నా రేండ్లనుండి యీ యటవుల నెఱుఁగుదు
నదికోలె నిన్ను నే నరయుచుంటిఁ
గదనకార్య మ్మొండు గలుగుట రాలేక
నిన్నొంటిఁ బంపితి నిన్నసంజ

నైన మీరు మీరు నందఱు నొకచోటఁ
జేరికొంటి రిది యుదారభావి
ఫలవిశేష మింక నలరుఁడి నీవు మా
విజయ యంచుఁ జోళవిభుని జూచి.

స్వామివారు మాఱువలుకనే వలుకరు
దీవ నైన నొసఁగఁ దివుర రకట!
యార్ష వాక్కు నర్థ మనుసరించెడు నంద్రు
తత్ఫల మ్మిఁకెట్లు దక్కు మాకు.

అనుఁడు మాని చకితుఁడై యంతరాత్మలో
నుబుకు బహుళదుఃఖ ముగ్గపట్టి
కాంచి తొంటిరీతిఁ గళ్యాణ మస్తని
పథికపృథ్వీపతికిఁ బలికె శుభము.

అపుడు సోమదేవుఁ డార్తనాదమ్ముతో
ఓమ్ముకట్టు ప్రిదిలి లోనిరక్త
మోడిగిలఁగఁ గూరుచుండెను విజయుకుఁ
బ్రాణ మెగిరె నతనిఁ బట్టె మాని.

ఇది యేమి యనుచుఁ జకితా
స్పదుఁడై నిస్తబ్ధుఁడయ్యెఁ బథికుం డాప
త్సదనములోఁ గాలిడి కర్
చెదరక్ దుఃఖాగ్నిభయదశిఖఁ గాంచినటుల్.

అంత నిన్న జరిగినట్టి యంశము లెల్లఁ
బూసఁగ్రుచ్చినట్లు మునివరుండు
కంఠగతములైన కన్నీళ్లు మ్రింగుచుఁ
బలుకుచుండ వినుచుఁ బథికయోధ.

నేఁ దలంచినయట్లు యిది ఘటిల్లిన దేను
నిటకు వచ్చిన యెంత యెసఁగియుండు
నా రక్కసులు ద్రోహులై పశ్చిమచళుక్య
విభులపాలికిఁ బోయి వెకలు లగుచు
నాంధ్రసామ్రాజ్యరహస్యమ్ము లిచ్చి యీ
యటవికిఁ జేరినా రంచుఁ దెలిసి
వెదకుచు నేగ మా విభుఁడు కళింగేంద్రుఁ
డొక వేగుఁ బంపె 'నీ యూహ యొప్పు

నాత్మపురిపైకి నెత్తిన యరుల కకట!
దొంగయై తాను లొంగి కళింగమునకు
సాయమై విజయాదిత్యజనవిభుండు
పగఱఁ దెచ్చెడి వేగ రావలయు నీవు.

ఇది ముందెత్తిగియె యిట మీ
హృదయమ్మున వేయఁదలఁచి యే తెంచితి నీ
యదనున నీ సోమున కీ
హృదయవ్రణ మంచు నాతఁ డెరియుచునుండన్.

నాజోహా రందుకొనుము విరాజమాన
దివ్యపూరుష! మనమ్మున స్త్రీప్రబాధ
తోమ్మునాటిన ఖడ్గవ్రణమ్మువలనఁ
గాదు, కలిగెడి నది యొక్క కారణమున.

పారతంత్ర్యమ్ము తెలుఁగులపాలఁబడును
దెలుఁగుసింగమ్ము లినుపబోనులను జిక్కుఁ
దెనుఁగుమఁగటిమివాదర యణఁగిపోవు
హృదయమర్మవ్రణమ్ము నా కిదియె పూజ్య!

తెనుఁగురాజ్యసముజ్జ్వలద్దీపకళిక
సూర్యునకు సాటియై జగజ్జ్యోతి యగుచు
వెలిఁగె, నీ నాఁడు కొడిఁగట్టి మలఁగనుండె
బెదరుగుండియదెబ్బ నా కిది మహాత్మ!

లుకలుకమంచుఁ బశ్చిమచళుక్యచమూక్రిములాంధ్రరాజ్యఘో
టకరుధిరమ్ముఁ బీల్చఁగ హుటాహుటి రేగిన వాంధ్రశౌర్యపా
వకశిఖులన్ దహించి మనవంతుపనిన్ జరిపింపకున్నచో
నిఁక మన మీ తెనుంగుజగతీందిరకున్ భరమాట నిక్కమౌ

దఱి గనరాక శాత్రవవితానమహాంబుధి నింగిముట్టుచున్
బెరిగి తెలుంగురాజ్యపృథివీధరమున్ బెకలించి ముంపఁగన్
నురగలు గ్రక్కుచున్ వెడలె,నొవ్వకయిప్పు డగస్త్యపోల్కి నం
గరమునఁ ద్రాగకున్న మనగౌరవకీర్తులు దక్కునే యిఁకన్.

చటులశాత్రవసైనికోచ్చండజలధి
నాంధ్రసైనికవీరనౌకాళి నెక్కి
తెలుఁగుమగసిరిరతనముల్ వెలలుకట్టి
యమ్ముకొన లెండు విజయమూల్యముల కిపుడు.

ఒఱలన్ దూయుఁడి కత్తులన్ రిపుభటవ్యూహాభ్రరంగస్థలిన్
మెఱుపుంగన్నెలు నాట్యమాడునటులన్ నేర్పుల్ ప్రదర్శింప ని
ర్భరకీర్తిప్రసవాళి నాంధ్రజననిన్ 'వందామహే' యంచు సు
స్థిరభక్తిన్ జయగీతముల్ నుడువుచున్ సేవింప లేలెండిఁకన్.

అనుచు నావేదనమున నెమ్మనము కంద
నురుతరావేశమునను మైమఱచి యింక
నేమియో పల్క నుంకించు సోమదేవు
బలిమి శయనింపఁగాఁ జేసి పలుకు మాని.

ఇమ్ముగ దేశభక్తి వెలయించుచు నీవు వచించినట్టి వా
క్యమ్ములు రూపుఁగొన్న హృదయంగమవీరరసప్రధానగా
నమ్ములు, కాని నీ తను వనర్హము, నేనో నిరీహకుండఁ, బ్రా
ణమ్ములు నీపయిన్ నిలిపినట్టిది నీ ప్రియురాలు తమ్ముఁడా !

పగఱదళమ్ము లేచి మనపైఁ బడనున్నది, పోరికోసమై
మిగులఁ దయారుగొన్నది శ్రమించెను దవ్వులఁబట్టి, దీనిపై
దెగఁబడి యేను నీ విపు డెదిర్చిన నీ విజయాకుమారితో
మగసిరి నేలపా లగుట మాత్రమె కా దపకీర్తి తమ్ముఁడా!

ఏ మను వారు మీర? లిది యిట్టిది కాదె? తెనుంగుదేశమున్
నామెయి రక్తమిచ్చి యయినన్ బ్రతికించుకొనంగ నెంచినన్
భూమిమహేంద్రవంశమణిపూజ్య! ఫలించునె సుంతయైన మా
సోమునికోర్కి, వట్టియలసుల్ తెలుఁగుల్ చెయిదాటెనంతయున్

అని యూరకుండె మానియు
ననుజుం డగ్రజునిమాట లవిధేయునటుల్
వినుచుండె, విజయవింతగఁ
గనుచుండెను, బధికుఁ డపుడు కనుఁగొని వారిన్.

ఏమి ప్రయోజనమ్మునకయి యే నరుదెంచితినో తదర్థమే
సోమకుమారుఁడున్ బలికె సూత్రితమున్ బొనరించి, దానిపై
స్వామియనుగ్రహమ్ము నిరవగ్రహమై ప్రవహించె, మన్మనః
కామితమున్ ఫలించినటుగాఁ దలపోసెద దీని నంతయున్.

ఇప్పటి కేడువత్సరము లేను దెనుంగువిలాతికోస మీ
తిప్పలఁ గానలన్ దిరుగుదివ్యులయాశిష మంది వచ్చు నీ
యుప్పెనఁ దట్టుకోఁదగిన వ్యూహముపన్నుకొనంగ నేర్చుటా
చొప్పునకాత్మ నేఁడిచటఁ జొక్కెనుమీవలనన్ ఋషిప్రభూ!

దవ్వులనుండియే యెఱిఁగి తానెదురొడ్డి యరాతిసేనతోఁ
జివ్వ నొనర్పఁగాఁ దెనుఁగుసేన తయారయియుండె, వేగుల
న్దివ్వెలు రాజ్యసౌధమున నిల్చి వెలింగెడి శత్రుమాయలన్
గ్రొవ్విననీలిచీఁకటులకున్ బెనుమిత్తులుగా ఋషిప్రభూ!

తారసిలంగఁ దెల్గుసరదారులు మీదుసహాయసంపదన్
గోరిరి, నన్పఁబంపి రదిగో యిదిగో యని మీదు రాకకై
దారులు చూతు, రర్విపతి తానె ప్రయాణమొనర్చెనన్న, మీ
భూరిపరాక్రమమ్ము విని పొంగెను నావలనన్ ఋషిప్రభూ!

లెం డిఁక రండు తెల్గుటని రెండవకవ్వడి చేయిఁజూపి మా
కండగ నిల్వఁగా విమతకాండము చెండఁగ గెల్పుటింతి మీ
నిండుమగంటిమిన్ దనకు నెయ్యపుటుంకువగా గ్రహింప నీ
గండము గాయఁగాఁ బగఱగండరగండఁడవై ఋషిప్రభూ!

ఋషి యగు టేమి లెస్స,యుడుకెత్తిన నెత్తురులోనిమంటలన్
విషమశిలీముఖమ్ములకు విందొనరించి స్వజాతిగౌరవ
త్విష విజయధ్వజమ్మునఁ బ్రతిష్ఠ యొనర్చి రణాధ్వనీనముల్
తృషిత తెనుంగుజీవములు తేర్చుట వీడినచో ఋషిప్రభూ!

తఱి యరుదెంచినన్ గదనతాండవమాడక తెన్గునెత్తుటన్
బెరిగినకర్మఠుండెవఁ డుపేక్షవహింపఁగనేర్చుఁ దీవ్రము
ష్కరరిపువీరము క్తపటుకాండపరంపర నాఁటి దివ్యసు
స్థిరఘనవైదికస్వమతదేహము తూట్లుపడన్ ఋషిప్రభూ!

చితికినపాలతాతినగిషీశకలమ్ములు చాకిరేవులం
దుతికెడి మైలబాండలయి యుండినఁగాని తెనుంగువార లీ
బ్రతుకున నీలిసంజ యెగఁబ్రాకఁగ నేర్చినఁగాని తెన్గు భూ
పతులయపప్రథాగతి కుపాధి నెఱుంగరొకో ఋషిప్రభూ!

అనుఁగుఁబడంతిజవ్వనపుటామనికిన్ బ్రియకోకిలమ్ముగా
మనుటకొ, మాతృదేశపదమంజులపీఠికి ముదుపూవుగాఁ
దనతనువున్ యజించుటకొ, తాపసి కావలెఁ గాని వట్టిగా
వనులను ముక్కుమూసికొని వందురు లేమిటికో ఋషిప్రభూ!

ఇత్తపమేల ? దీనిఫలమెయ్యది నీదగు జన్మభూమికిన్
గత్తులకోటఁగట్టి, వెఱగందఁగ నెత్తురగడ్డఁ ద్రవ్వి, లోఁ
దత్తరిలన్ రిపుల్ గెలుపుతత్తడి నెక్కి తెనుంగుబావుటా
నెత్తి మహోత్సవమ్ము జరిపింపఁగ లేనపుడో ఋషిప్రభూ!

కుమ్మెలు ప్రొవఁగాఁ బగఱగుండియ గ్రుమ్మక బారుటీటియన్
గ్రమ్మఱు నప్పుడీ యటవులన్ దప మెట్టులు తప్ప, దాత్మ తే
జమ్మడివోవు కోచ కది చక్కనిమార్గము, దాననైనఁ దాఁ
గ్రమ్మఱ బోటుమానిసిగఁ గాఁగలఁడే మొకదా! ఋషిప్రభూ!

అని యా రణయోధ మహో
ద్ధనివేశావేశకలితభీకరుఁడై త
న్మునివంకఁ గనుచు దీర్ఘా
సిని జళిపించుచు హుసారు సేయుచు నుండన్.

తెలుఁగగు దేశభక్తికి నిదేశము మీయుపదేశ మన్యథా
దొరయునె వేఁడినెత్తురులు దోఁగఁగఁ జిక్కని మేనికండలన్
గరిడి కలంకరించు మొనగానికిఁ? వట్టి నిరస్తబుద్ధి నీ
తరువుల ముక్కుమూసికొను తాపసుఁ డేమొనరించు వీరుఁడా!

ఇంతగ డొక్కజిచ్చుడుకులెత్తగ రేపిన త్వత్ప్రతాప మొ
క్కింతగ సోకెనేని సివమెత్తని యే మొగమొల్కయుండు, ను
ద్భ్రాంతులు కావితాలుపు లధన్యులుమాదృశు లిద్దివించునన్
శాంతము శాంత మంచుఁ బడిచావఁగఁ జూతురు కానివీరుఁడా!

నీకరమందు బుస్సురని నీల్గెడి పచ్చలపెద్దబాకు నా
పైకిని దూకి నట్లులికిపడ్డది డెందము, దాని కేమిఁకన్,
సోకుచు సోకుచున్ సెగలఁజూపుచుఁ బెన్నితిఁజూడుమాడ్కి నీ
వాకొక బాకుగా విసరఁబడ్డది నాయెద ప్రయ్యె వీరుఁడా!

ఒక్కొక కత్తివ్రేటునకు నొక్కొకచిక్కనిమేనికండయున్
బొక్కెడురక్తమున్ దఱిఁగిపోవఁగ గావుగొనంగ నిచ్చుచున్
రక్కెనతాల్మితో విజయలక్ష్మిని గైకొని వచ్చి చాలఁ జే
రెక్కెడు తెన్గుజాతిజనియించిన నా కిది సిగ్గ వీరుఁడా!

ఏనన్ గా నిమ్మిది యెద
నై నట్టుగ నాకుఁ దోఁప దాశ్రమభూమిన్
బోనిడ నేరను గదన
స్థానమునకు రాను నేర సైఁపఁగవలయున్

పలికినయన్నమాటకుఁ జివాలున ఱొమ్ము వ్రణమ్ము వ్రీలఁగా
నిలఁబడి సోముఁ డందికొనె నిక్కము సైఁపవలెన్ దెనుంగునం
దలవడు మేటిపుట్టువున కంతటి సిగ్గులచేటుమాటలన్
బలికిన యీదృశుండు పొరపాటున నాకును నన్నయాటకున్.

కఱకగు గండగత్తెరకుఁ గంఠములొగ్గడి తెన్గునేలకున్
బరువుగఁ బుట్టువందు టొకపాతక మద్ది తొలంచుబుద్ధి నీ
పరిగెలఁ బొంచియుండుటొకపాతక మట్టి యఘాభివృద్ధికిన్
దొరువగునాశ్రమమ్ములను ద్రొక్కిన సైఁపక యుండు టెట్లగున్

విజయా! లెమ్ము! విశాల మీ విపుల, నా వెంటన్, నిరాశాతపో
వృజిన మ్మీయుటజమ్ములో విడువలే నింతైన మత్ప్రాణముల్
త్యజనీయమ్ము నిరర్థ మీ బ్రదుకు సార్థక్యమ్ము సెందన్ నమి
ద్విజయశ్రీకి దృఢానుభక్తి మెయి నైవేద్యమ్ము గావించెదన్.

తే తె మ్మడిద మ్మదె యని
చేతమ్ముఁ గలంప విజయ చేకొని యీఁగాఁ
జేతికిఁ గొని గిరిశిఖరని
పాతస్రోతస్సుగా గబాగబ వెడలెన్.

అటుఁ జనునట్టి తమ్మునకు నడ్డముగాఁ జెనుగొండవ్రాలె న
జ్జటి నిలిచెన్, ప్రవాహ మిరుసక్కులదూయుచుఁ బోవురీతిగా
నటునిటుఁదమ్ముఁడున్ దిరుగులాడెను, జేతులు గ్రుమ్మరించియు
త్కటమగు వత్సలత్వమునఁ గౌఁగిటిలోనికిఁ దీసి యాతనిన్.

నీకయి తండ్రి! ప్రాణములు నిల్పితిబొందిని, దీనికోస మీ
యాకులపాక నిల్పితి, నిరర్థక మియ్యది యంటి వీవు నీ
బాకును నాకుని మ్మెదిరిపక్షమువక్షముఁ దూట్లుగొట్టి నే
నీకు జయమ్ముఁ గూర్తుశయనింపు సుఖమ్ముగనిందుఁదమ్ముఁడా!

ఈ దయలేని నాయెడఁద నింతకు మున్నొక వింత మొల్క నిం
పాదిగఁ బాదుఁజేసికొని వాసమొనర్చెను, దాని కింతతో
వాదరకత్తితోఁ దుడుపువచ్చె దపస్సహితమ్ముగాఁ దుదన్
సాదరమయ్యె, నిం దణుకణమ్మును నీ వయినావు తమ్ముఁడా!

మాట యిచ్చితి నమ్మ నామాట, నిశిత
మైన ప్రత్యగ్రరవికిరణాగ్రమందుఁ
గాని నామాటయందును గాని లేదు
కలుషకౌటిల్యసూక్ష్మాణుకణ మొకండు.

విజయ! యేమందువమ్మ! నీ విభునిపక్ష
మీవును వహించి వచియింతు వేమొ, యింత
మున్ను నీ కొసఁగినమాట పూర్తమయ్యె
నిపుడు నీ విభుకోర్కె ఫలింపనుండె.

మఱి, సెలవా కృపావతి! యుమావరదివ్యతరాశిషమ్మునన్
దొరకె భవత్ప్రియుం డితనితోఁ దపఆశ్రమసీమ నిచ్చటన్
వరలుము నే నొకండ నరివర్గముచెండి జయేందిరాపుర
స్సరముగ వచ్చి మీయమృతసంభృతదర్శనమున్ బొనర్చెదన్.

అని వచించునంత నాగంతుకస్వామి
మేను పొంగ నెగిరి మిన్నుముట్టి
కమలమధుపిపాసఁ గండుతుమ్మెదవోలె
మునిపదమ్ములకును మోకరిల్లి.

ఓ భువనప్రియంకరమహోదయ! నేటికి నాంధ్రకన్యకున్
శోభనవేళ డగ్గఱె యశోజయకన్య లనుంగుఁగత్తెలై
ప్రాభవమంగళాక్షతలు పట్టిరి, పట్టినమీదుక త్తికిన్
క్షోభిలుశత్రుకాంతలమనోనలకీల నివాళివెట్టుచున్.

నా నయనాలలో మెఱుపు నాట్యములాడిన దీ తెనుంగు మా
గాణము పండిపోయిన దఖండముద మ్మొలయించుకొన్న దీ
మా నిఱుపేదరాణువ గుమంగుమలాడిన దీ తపోవనీ
స్థానము చిక్కె నిందమృతసత్రము నేటికి శౌర్యలక్ష్మికిన్.

కదనకంఖాణ మొకటి మీకై కళింగ
పట్టణమునుండి పంపఁగాబడును రేపు
ఈ మహాయుద్ధరథము సాగింపుఁ డిందు
విజయలక్ష్మిని గూర్చుండఁబెట్టి మీరు.

తెలుఁగుదేశమ్ము త్రికళింగదేశ మనఁగ
నాంధ్రరాజ్యమ్ముగాదె యందధివసించుఁ
ప్రజలు నాంధ్రులు కారె యీ భండనము క
ళింగమున నైనఁ దెనుఁగువారిదె మహాత్మ!

అనుచు సోమదేవునాననమ్మును జూచె
నతఁడు నేత్రయుగళి యమృతధార
నన్నపాదములకు నభిషేక మొనరించు
చుండె మేను దెలియకుండె నపుడు.

చిఱుబుగ్గనిగ్గులు చెదరఁ జారిక లౌచు
    దొరలుకన్నీటిని దుడిచి తుడిచి
ఫాలార్థశశి రాహుభంగి గ్రమ్మినకురుల్
    తీరుగా మీఁదికి దిద్ది దిద్ది
చండాగ్నిపైఁ బెద్దజడి వ్రాలెఁ బెల్లుగాఁ
    జెవికి స్వాతంత్ర్యమ్ముఁ జిలికిచిలికి
విరితేనెసొక్కి లేపిన సోని యళివలె
    హత్తిన పదగతు నెత్తి యెత్తి

బలిమిమీఁదఁ దమ్ము నిలుచుండఁగాఁ జేసి
యలరఁజేసి తాను నలరి మాని
యాగతావనీశు నామంత్రణము చేసె
వీరమాస్యమందుఁ బాఱఁ కాడ.

రణయోధ లేచి చంగున నెక్కె గోడిగఁ
    బదిబార లెగిచి యాపైని నిలిపి
విజయను బిలిచి వివిక్తస్థలిఁ నిల్పి
    యేమమ్మ! నన్ను గుర్తించి యుంటె

యని తనయశ్వమ్మునంటి నిల్చినయామె
మృదుగండములు వంగి మీటి, నామె
చోళదేవుండును సోమదేవుండును
దప్ప నే నొకతె మాత్రమ్ము నిన్న

గుర్తుపట్టితి నింత యకుంఠితంపు
టర్హ వేషమ్ము నెట్టులు నలవరించి
కొంటివో యన నాతఁడు గునిసినవ్వి
యట్లు కాకున్న ఫలమెట్టులంచు నేగె.

# ప్రభాతము

## నవమఖండము

ఒక్కచేత నసి మఱొక్కచేతను డాలు
తల తురాయిపాగ మొలను బాకు
ఉక్కుకవచ మొడలఁ జక్కనిగుఱ్ఱంబు
పోవుదారి కదనభూమిపోవు.

కొరడావేయ డొకించుకంత మడిమల్ కుంచించి తాటింపఁడే
తటిఁగళ్లెమ్మునుజిక్కఁబట్టఁడుహయోత్తంసమ్ము ముంగాళ్లఁజెం
గి రణక్షోణిఁ దురంగలించె జయలక్ష్మిముగ్ధగాథానుషం
గరిరంసామతియైనస్వామికి సమీకప్రేమ రెట్టింపగన్.

తురగఖురపుటక్షుణ్ణో
త్థరజఃఖండములు ద్విరదదానాంబుపరం
పర లంటి కొండఱాలై
విఱిగిపడన్ గవియుచుండ్రి వీరు లిరుదెసన్.

ప్రాచిన్ గంభీరాబ్ధి యు
దీచిన్ సింహాద్రి తత్ప్రతీచిన్ భయద
ప్రాచుర్యవిశాఖాద్రి య
వాచిన్ మైదానమెసఁగుఁ బ్రధనస్థలికిన్.

ఒకచోట గదలయుద్ఘాత సేన్గులపుఱ్ఱె
లెల్లఁ బెఠిల్లుపెఠిల్లు మనఁగ
నొకప్రక్కఁ బాడిరాల నుక్కుకటార్ల రా
పిళ్లు ఘణిల్లుఘణిల్లు మనఁగ
నొకచెంత శైలశృంగోపలమ్ములు జారి
విఱిగి గుభిల్లుగుభిల్లు మనఁగ
నొకదండను ఫిరంగు లుప్పొంగి పొగలతో
మింట ఢమిల్లుఢమిల్లు మనఁగ

రోషపదములు రణరంగరూక్షచరిత
లల్లెత్రాడులమ్రోఁతలు నంపకోఁత
లామిషాస్థివసాశోణి తార్ద్రభూము
లుబ్బలుబ్బలికలనఁగాలూడకుండె.

ప్రళయకాలాగ్నికీలాప్రభాకరాళ
దీర్ఘకరవాలచాలనోత్తేజనమున
నాశ్వికుఁ డతండు సైన్యమధ్యంబునందుఁ
గొఱవిఁద్రిప్పినచందానఁ దిరుగుచుండ.

ప్రత్యుదితప్రభావులయి ప్రాగ్రసరుల్ జయసింహవిక్రమా
దిత్యులు కుంతలప్రభులు తెంపునఁ గోల్తలకోర్చుచున్ జయ
ప్రత్యయశంఖనాదములు పట్టుచు రాణువ లేవఁదట్టుచున్
నత్యముగాఁగఁ బోరిరి తెనుంగు మొనల్ కలగుండు సెందఁగన్

అగ్గతిఁగాంచి వారలకు నడ్డముగా నతఁ డగ్గికంటితో
ప్రొగ్గినయీశ్వరుండటులఁ బోయియెదుర్చుచు వారిపాళిమున్
మర్గమువట్టి యాపయి నమాంతముదూకి తదీయశీర్షముల్
బుగ్గిగఁజేసెఁ దెగ్గుటసి గ్రొచ్చి వియత్తలి కెత్తి యక్కసిన్.

దానికి విజయాదిత్యుఁడు
భూనభములు మాఱుమ్రోయ భ్రుకుటీవికటో
డ్డీనక్రోధత శంఖ
ధ్వానము గావించెఁ బౌఁజు దార్కొన మొనకున్.

చిచ్చెగఁజిమ్మిన ట్లెదిరిసేన తెలుంగుకళింగసేన యొ
క్కచ్చుమెయిన్ టకాటకిని గిత్తులనొండొరులు త్తరించి వి
వ్వచ్చముగాఁగఁ బోరి యసివారుగనేగి యరాతిశీర్షముల్
గ్రుచ్చుచు నత్తఱిన్ బుడమిఁ గూలుచు నెత్తురుజల్లులాడఁగన్

ఆశ్వికుఁ డాతఁడు ముఖమం
దాశ్వాసింపని రణప్రతాపాగ్నిశిఖన్
విశ్వాసికళింగుఁడు తను
శాశ్వతముగ మెచ్చ దూకె శత్రుబలము పై.

వానిజవనాశ్వపాదాలలోనిజవము
వానినునుఁజేతి వ్రేళ్లలోపలిచలాకు
కాంచి కెవ్వన నార్చి యకాలమృతికి
నెదిరిపోఁజెల్లఁ బ్రాణముల్ వదలుచుండె.

వానినునువంపు నిడువాలులోనికఱకు
వానిగుఱిపోని మేల్చూపులోనిచుఱుకు
కాంచి కోలాహలమ్మునఁ గడలుకొనుచు
నాత్మబలములు రేచి మిన్నందుచుండె.

ఆరీతి స్వపరబలములు
కారాడుచుఁ బోరుచుండఁగా నతఁ డుద్య
ద్వీరరసమూర్తియై రిపు
వారమ్ములు పాయఁదట్టి పైపై కేగన్.

ఎదురుపడెన్ నిశాతపటుహేతి తళత్తళకాంతు లీన దు
ర్మదరిపువీరుఁ డొక్కఁడు తురంగముముందుకుఁ జోపినెట్టి యం
గద గొదగొన్న పెద్దపులిగా మిడిగ్రుడ్డులఁ జంద్రనిప్పుకల్
ప్రిదులఁ గరాళదంష్ట్రికలు బెట్టుబిగించుచు నోడునొత్తుచున్.

వైరి హఠాత్తుగా నెదురువడ్డ క్షణంబునఁ దొంటివీపు ర
క్తారుణనేత్రకోణము లయత్నముగాఁ దెలుపెక్కె బాష్పవాః
పూరములయ్యె, వ్రాన్పడె వపుఃప్రకరంబు, లలాటమందు జో
హారని యంజలించిన కరాంగుళులన్ దిగజారె ఖడ్గమున్.

అక్కటకటా! శిరోనమితుఁడై యతఁ డప్పు డలౌకికప్రపం
చకమున భావనానిగళసంగ్రథితాత్మజవమ్ముతోడ ఘో
టకమున నుండెఁ జిత్రితపటమ్ముగ మృత్యుకరాళదంష్ట్రికా
క్రకచనికృంతనమ్ములసొరంగములన్ దలదూర్చు నట్లుగన్.

హృదయమర్మవ్రణోచ్ఛేది కదనభూమి
వీరనియమమ్ము లెంతకఠోరములగుఁ
దండ్రి పినతండ్రి సుతుఁడు సోదరుఁడు తనకు
వీరె యనుకోక తనకత్తి విసరవలయు.

బురబుర పుక్కిలింతలయిపోయి బొళుక్కున వాంతివచ్చు క
వరమున వైరి దీర్ఘతరవారి వెసన్ విసరన్ స్వహస్తకో
పరిపరికుంచితాత్మకరభాసురుఁడై మునుప్రాలె దానికిన్
గుఱియయియానిరాయుధుఁడునోర్వఁడుతప్పికొనండొకింతయున్

వయసు తేనియ లల్లనఁ బ్రాకులాడ
మొలకజీవాలు మెల్లన మొగ్గ లిడఁగఁ
బెరిగి పెద్దవాఁడైన దా వీరుఁ డతని
యసికిఁ దనమేను నాహుతి నొసఁగుకొఱక?

కదనలక్ష్మికి గారాబుకన్నకొడుకు
విజయలక్ష్మికిఁ బ్రేమంపుఁ బిన్నసుతుఁడు
తత్సమక్షమునందె, యాతండు నేఁటి
కతనితరవారిభుజగి కాహార మగున?

దేశకల్యాణ దివ్యోపదేశికుండు
ఆశపడి పోరుచున్న యావేశికుండు
పైకి లేచిన శత్రుమహోకరాళ
ఖడ్గహతిఁ దప్పికొనఁగ మార్గమ్మొ లేద ?

నో రెఱుంగని మృగముల నుఱుము మృగయుఁ
డబలల బలాత్కరించెడి యాతతాయి
పరులరాజ్యాలకై యాసపడెడి వాఁడు
హత్యయన లోన నింతేని నడలువారో ?

లేచెనో లేదో కత్తివిదళింపఁబడెన్ శతధా; పిఱుందుగాఁ
దోఁచెఁ గళింగరాజ్యఘనదుర్గనియంత, సమీకరంత వీ
రోచితకర్మఠుండు, శఠయోగ్యవిధానశఠుండు వైరిగ
ర్వాచరణ మ్మొకండ చరమాచరణమ్ముగఁ జేసివైరికిన్.

కాకపోవున దెప్పుడు కాకపోవు
జరుగనున్నది తప్పక జరిగితీరుఁ
దనకు భవితవ్యతమె లేని తరుణమందు
హస్తగతమైనయదియు మాయమ్మొ యగును.

ఆశ కెవ్వారు దాసులో యఖిలలోక
ములకు వారలు దాసులై పోవవలయు
నాశ యెవ్వారలకు దాసియగునో వారి
కఖిలలోకాలు దాస్యము నాచరించు.

చాళుక్యకులశరచ్చంద్రదస్ఫురచ్చంద్రి
కన్ గళంకచ్ఛాయఁ గాఱుకొలిపి
రాజరాడ్గుణవల్లరీజాతపుష్పమ్ము
గమగమ పోవంగఁగాలరాచి
నన్నయ్య నిల్పి రత్నాలుతాపిన యశ
స్తంభంబు నేలమట్టంబు చేసి
పావనాఖండగోదావరిన్ మఱుజన్మ
కోసమై దుష్కీర్తి గుప్తపఱచి
రాణ్మహేంద్రపురి కరాతు లెత్తినఁదాను
లొంగి వారలను గళింగమునకుఁ
దెచ్చినట్టి దుర్మతిన్ విజయాదిత్యు
డాసుఁ జేయకున్నె యాస నేఁడు.

వసుమతి సర్వమున్ దఖలుపడ్డది, యందలి హక్కు భుక్తమై
సిసలుకొనెన్, దదీయసుఖసేవన చాలదె? యన్నపట్టి కు
ట్టుసురులకై కళింగమున కుద్దవిడిన్ జనుదెంచు టొప్పునే? ఈ
దిస మొలయాస యెంతటి పతివ్రతయో విడదింక నాతనిన్.

నిగ్గుబుగ్గల లేనవ్వు నిలిపికొని క
ళింగపతి పట్టువడిన యరిన్ ఖయి దిడ
హస్తసంజ్ఞను భటులతో నవల కనిపి
చోళదేవుని గ్రీగంటఁ జూచెఁ దాను.

ఆ కళింగుఁడు చూపిన యాదరమ్ము
ప్రాణభిక్షామహోత్కృష్టఫలముఁ దలఁచి
చోళుఁడు కృతజ్ఞతాభంగిఁ జూపఁ డతని
కా మహామృత్యువదనగహ్వరమె సుఖమొ!

ప్రణయసుస్నిగ్ధ మసృణంపుఁబాణిఁ జాచి
ముగ్ధచకితావలోకనములను బఱపి
రమ్ము వీరాగ్రణీ! యన్న రా డతండు
సమరనికషోపలపరీక్ష జరుగ లేదొ?

యుద్ధమునఁ బుల్కరించిన యుష్మదీయ
ఖడ్గమునఁ గాదె మాకును గౌరవమ్ము
రమ్ము వీరాగ్రణీ! యన్న రా డతండు
జేగురించిన మొగ మట్టె చిన్నవోయె.

పశ్చిమచళుక్యసైనికాభ్రముల నెల్లఁ
జించిన నిదాఘతీవ్రరశ్మివి మహాత్మ!
రమ్ము వీరాగ్రణీ! యన్న రాఁ డతండు
వదనపద్మమ్ము క్రిందికి వ్రాలిపోయె.

వృద్ధుని గళింగుఁ జంపించి విషము వెట్టి
పట్టికై వేచిన యతండు పట్టువడెను
రమ్ము వీరాగ్రణీ! యన్న రా డతండు
రక్తకణములు రాలెఁ గ్రీఁగంటి నుండి.

అగ్రజతనూజు నెపముచే సంహరింపఁ
దొడఁగిన కఠోరుఁ డాతఁడు దొరకె నేఁడు
రమ్ము వీరాగ్రణీ! యన్న రాఁ డతండు
జేవురించిన మొగమునఁ జిందెఁ జెమట.

వాంఛ లేని యుమాబాలఁ బట్టువట్టి
కొడుకునకుఁ జేకొనఁ జూచు కూళ చిక్కె
రమ్ము వీరాగ్రణీ! యన్న రాఁ డతండు
కనులఁ గన్నీరు మున్నీరుగాఁగఁ గార్చె.

భూరివిపులవిశాల యీ భూతధాత్రి
యింతనై రాజ్య మొందుకోయీ! మహాత్మ!
రమ్ము వీరాగ్రణీ! యన్న రాఁ డతండు
విడిచె నిస్స్పృహనిశ్వాసవీచి యొకటి.

మహితసామంతనృపనమన్మౌళిముకుట
రత్నరంజితచరణసమ్రాట్టునాజ్ఞ
యిది, యిఁకన్ రమ్ము వీరాగ్రణీ! యటన్న
నతఁడు వెడలె నిబద్ధహర్యక్షు మట్లు.

యుష్మదీయభుజప్రతాపోరులక్ష్మి
కీ సువర్ణాంగుళీయ మర్పించు చుంటి
నుపదగా మీకు నని యాతఁ డొసఁగ నప్పు
డతఁడు ని స్తబ్ధుఁడై దాని నందె, నపుడు.

సమరోర్విన్ బటుదృప్తకుంతలరిపుతుష్మీవాలచక్రమ్ము తుం
త్తుమురంబున్ విషబుద్ధి వారలకుఁ జేవోర్డైన వేంగీనృపా
ధముఁడాబంధితుఁడౌచు బ్రహ్మా సేనజయధ్యానమ్ము లభ్రంకషో
త్కృష్టమశంఖారవకాహళారవరటద్ఘంటారవాకీర్ణమై.

చిఱునువ్వుల్ రవళింపదానజలముల్ చిందన్ శ్రవఃశూర్పముల్
చెఱుగన్ దేటుల దంతికత్స్య కదలెన్ లీలాపదన్యాసతన్
జరణాగ్రమ్ముల వల్గుయానములఁ గ్రైజా మోరలల్లార్చుచున్
మరగంబుల్ నడిచెన్ గుడాహులకుసాదుల్ మూదలింపన్ బయిన్

# ప్రభాతము

## దశమఖండము

దూరమునఁ దెస్గులే కవిసి దొమ్మిరియొనర్చి రటంచుఁ జూచి య
బ్బురము విషాద మాతుర మపూర్వబిభీషికయున్ వహించిమే
గరు పొడువన్ జెమర్ప వడఁకన్ నిలుపోపక మూర్ఛ వ్రాయిభా
స్కరుఁడు గుభిల్లునన్ బడె సకాండముగాఁజరమాచలాగ్రిమన్

ఆ యురుపాత మొందు రవియంగము నెత్తురులట్లు సంజకెం
జాయలు జాలువాఱె, నవి సత్యముగా రుధిరమ్ము లంచు స
స్త్రీ యిడకుండ వేఁకటికి చీఁకటిపేరిటి జెబ్బులుల్ మహా
ప్యాయముతోడ లేచి పరవ ళ్లొనరించె జగద్వనమ్మునన్.

ఎవ్వ రెంతగ మిట్టిపా టెనసి రేని
ఆ నిశాదేవి కడుపులో నదుము కొనును
ఎంత చింతాదురాక్రాంతు కేని యామె
యిడు నయాచితరీతి హాయిని దనంత.

శాంతము కొంతగాఁ బటనిశాంతములన్ జొఱఁబారి యేకయా
మాంతములో నితాంతము నిశాంతము లెల్లెడ నిండిపోయె, నే
కాంతమునన్ వసించిన యొకానొక జీవుఁడు చోళదేవుఁ డు
ద్భ్రాంతమనస్కుఁడై శిరము వ్రాలిచిలోన సుఖింపఁడింతయున్

పరువంపుఁ బసిమి బంగరు మెఱుంగులతోడఁ
        దపనబింబము సముద్రమునఁ దోఁగ
నీలాలఁ గెంపులంటిన బెడంగులతోడ
        మలిసంజనీలి మబ్బులను రేగఁ
గటికి కాటుక వెంట్రుకల వాల్జడలతోడఁ
        జిమ్మ చీఁకటికన్నె చెలఁగసాగ
వెలిగాజు గుళికల విద్యుచ్ఛవులతోడ
        మిలమిలఁ దారకల్ మింటమూఁగఁ

చోళదేవుని హృదయనిస్తుషితశోక
భావభారమ్ము క్రమముగా మోవలేని
భారమట్టులఁ బెరిగి పోఁ 'బాప' మతఁడు
నిలిచి నిట్టూర్పువుచ్చి కన్నీరునించి.

భ్రాతృదేవున కొసఁగిన ప్రతినకొఱకు
ఈ దృశనృశంసరక్తసిక్తాసనమున
కకట ! పాల్పడితిఁ బితృవ్యహంతనైతి
నింకఁ దమ్ముని మొగము నే నెట్లు చూతు.

అంతుదొరకని నానేత్రకాంతి రాశి
మొదలెఱుంగని నా తపస్సులకు ఫలము
అమలమగు నాదు విశ్వకల్యాణ సత్య
మతఁడు నా ప్రాణములకంటె నధికతముఁడు.

నా యదృష్టదేవత ఫాలనవ్యముకుర
మండలంకృత నీలంపు టలక మతఁడు
నాయశఃకాంత యక్షికోణముల రెంట
లిప్తసౌందర్య కజ్జలరేఖ యతఁడు.

ఆవిశీర్ణకుటీరదర్భాజినమున
నలవటించెదు నాదు ప్రియానుజుండు
వజ్రనిర్ఘాతమైన యీవార్తవినినఁ
ప్రతిహత మమంగళమ్ము పాపముశమించు.

ప్రణయాశ్రుధారా ప్రవాహశీకరములు
చిఱుబుగ్గ నిగ్గులఁ జిందులాడ
లేఁగెంపుఁ జివురాకు రేకు వాతెఱలందుఁ
దెలిమొగ్గ పలురేక మొలకదేరఁ
దీరుతీయని జుంటితేనియల్ జాలుగా
నెదనుండి నాల్కపై కెగురుచుండఁ
దళతళల్ గొల్పు వెన్నెలపిన్న నవ్వులు
స్వాతంత్ర్యరమకు నివాళులొసఁగ

దేశకల్యాణ దివ్యాపదేశ మొసఁగి
కడలు నవు జేను రాజ్యరక్షణ మొకండు
ప్రణయభిక్షగ నాచెంతఁ బడయుటతఁడు
తప్ప కీపాప మొడి నేను దాల్చుకొనక !

నాదుజీవిక పోవనీ నాయశస్సు
మాయనీ యుద్ధపథకమే మాఱిపోయి
నాకు దాస్యమె కలుగనీ నాదుననుజు
కలుషితమ్మైన ముఖమునేఁ గాంచఁజాల.

అని తెగించి స్వసజ్జితహయము నెక్కి
యరిగె నెటకో హుటాహుటి నధికభయద
భుజగదానవ ఖురళీప్రమూఢమైన
కాళరాత్రిని మేల్కొల్పఁగా నతండు.

ఖంగున మ్రోసె నప్డు తొలిగంట, వివిక్తవిభావరీప్రియా
లింగనవేళయైన దిఁక లెమ్ము మహోదయ ! చండభానుఁడ
స్తంగతుఁడయ్యె నన్నటులఁ, దద్ధ్వనికిన్ వెనువెంటఁ బ్రాగ్దిశా
ప్రాంగణమెల్లఁ దెల్లవడెఁ బక్కునఁ బ్రాక్సతి నవ్వినట్లుగన్.

చలువ వెన్నెలపూలవలపు లెవ్వఁడొసంగె
జేజేల జీవికాశ్రీలతలకు
గాంగపాథస్తరంగముల నూఁగె నెవండు
శివజటాజూటసుస్నిగ్ధవాటిఁ

జిలుఁగందు నెవఁడు కైసేసె బొమ్మనఁ బ్రియా
లలితకస్తూరికాతిలకమట్లు
తోఁబుట్టు వెవ్వాఁడు దుగ్ధవారాన్నిధి
కడుపారఁ గన్నట్టి కలిమిచెలికి

ఎవఁడు నిజకళాదానమ్ము నివతళించి
విబుధకువలయమేలు సద్వినుతిశాలి
యా కళాసిద్ధహస్తుఁడా యమృతమూర్తి
నింగి కెగఁబ్రాకి రేకన్నెఁ దొంగిచూచె.

తొణికిసలాడిన వైందవ
మణులు పిసాళించెఁ గుమగుమన్ గలువల్ చేఁ
బుణికె ముసుఁగిడఁగఁ గమలిని
ఝణఝణ కరకంకణాలి ఝంకృతు లెసఁగన్.

ఆనులి తెలివెన్నెల పూఁ
దేనెలు సోనలుగ మేన దిగువారఁగఁ గం
ఖాణముపైని గళింగుఁడు
కానికతోఁ జోళదేవు కడకున్ వచ్చెన్.

ఆ గుడారుముందు నతఁ డశ్వమును నాఁపి
యవతరించి లోని కవతరించెఁ
జోళదేవుఁ డందుఁ జూడంగఁబడఁ డింత
వెలికి వచ్చి యతఁడు నిలిచె నంత.

కలికితురాయికుచ్చు చిఱుగాలికి నూగిసలాడు, జాళువా
తళుకుఁబసిండి సేల్వమడతల్ పొరలెత్తును, బచ్చకప్రపుం
బలుకువిడెమ్ము గుమ్మనఁగఁబర్వ, లలాటముడిగ్గి చెక్కులన్
దిలకము జాఱుఁజెమ్మగిలి, దీర్ఘముగా నతఁడెంచుచున్నెడన్.

అరుగుదెంచి చోళుఁడటఁ గళింగుని గాంచి
సంభ్రమించి యెడఁదఁ జక్కనిలిపి
యుద్ధసరణి మ్రొక్కి యుచితాసనుని జేసి
దండనున్న పీఠిఁ దాను గొనుచు.

ఆ కాళింగుఁ డొకండె తా నిట కమందానందమానోజ్ఞ రా
జ్ఞీ కల్యాణముగాఁ గనంబడెడి జ్యోత్స్నవేళ రానేల? యీ
లోకాతీత కళావిజృంభిత తనూరూపమ్ము మానుష్యమా
నా? కాదా? మగవారికిట్లలరునా?యంచెంచువీక్షించుచున్.

కనిపెట్టి యది కళింగుఁడు
తనపీఠిక నతనిపీఠిదండకుఁ గొని బు
గ్గునఁ గప్రవిడెము వాసన
మినుముట్టఁగఁ జోళదేవు మెల్లనఁ బలుకున్.

ఎటకేగియుంటిరో ! మీ
కటారునకుఁ గంకణమ్ముఁ గట్టి కళింగో
త్కట జయలక్ష్మీకన్యన్ మీ
కిట నిడ నేతెంచినార మేము మహాత్మా !

మా సేనాని భవత్స
మ్మానిత విక్రమము మిగుల మానసభనుడవై
లో ననుమానము పడితిమి
కానీ ప్రత్యక్షమయ్యెఁగా సర్వమ్మునై.

మీ నామమ్మేమిటో? మా
సేనాని వచింపఁ డది వచింపఁగ గుప్త
మ్మానో! మిము నిచ్చటను జ
యానాథుం డనియె మాచమూపతి వాడున్.

అంచె లంచెలుగాఁగ మే మంపినట్టి
తురగములు మీకుఁ జేరెనో! యురుకృపార్ద్ర
హృదయమున మీరు వేళకు నేగుదెంచి
యుంటచేఁగాదె కలిగె నీయుద్ధజయము.

అనికళింగనేత యాత్మకార్తజ్ఞ్యము
వెల్లడింప; జయము వెలసె తమదు
దూరదృష్టివలనఁ; గారణమ్మని ప్రభూ!
యనుట యర్థవాద మగును నన్ను.

అనిచోళుఁడు వచియించిన
వినుచుఁ గళింగ ప్రభుండు వింతగనతనిఁ
గనుఁగొనుచుఁ నుమను మీరలు
గనియుంటిరో యెన్నఁడేనిగాని మహాత్మా!

ఆలలితాంగిముగ్ధ హృదయమ్మును మీరలెఱుంగనౌ; సుమ
బాలికనాపుమెత్తనట బాష్పజలమ్ములు జాలువారె ము
త్యాలసరమ్ములీడిన విధమ్మునమీకును, జోళరాజ్ఞికాఁ
జాలినయామె కట్టియగచాట్లు ఘటిల్లుట కేమి హేతువౌ.

ఆమె సమగ్రయౌవనలతాంతపరీమళవల్లి మీఁద దు
ష్ప్రేమవిషానిలమ్మొకటి వీచె భయంకరకాలవహ్నితో
ఆమెనవారవిందమధురాచ్ఛసుధాప్రణయాంజలిన్ నిరా
శామయకాలకూటవిషసాంద్రకణమ్ములు చిల్కె నెవ్వఁడో.

పెరిమంపుంజిగిపైకిఁ బొంగిన గులాబీమొగ్గ నానానమ
స్కరనాథాగ్ర శిరోగ్రదివ్యముకుటన్యస్తాబ్జరాగోజ్జ్వల
చ్ఛిరసౌభాగ్యముగాంచునో, పృథుల భస్మీభూతనానాశవా
కరదుర్గంధసమాధులన్ నలఁగఁద్రొక్కంబాఱునో యోధుఁడా

ఆలతాంగి వరించు రత్నాలమొగ్గ
ఆనితంబిని కోరు కల్యాణ కళిక
ఆతపస్విని వెదకు ముత్యాలకోవ
యెవఁడో చోళదేవుండని యెనువింపు.

పరకేసరి వర్మను మీ
రెఱుఁగుదురో యతఁడు ముఖ్యుఁడెంతయు మాకున్
దఱచుగ నట కరుగుదు సుమ
పరిచయమును గలదు యోధవరమూర్ధన్యా !

వావిమేనత్త కొడుకుఁ గావలసి చోళ
దేవుఁడాయుమతోడ యథేచ్ఛతోడ
శ్రీమహారాజ్ఞమహేంద్ర కాంచీపురమ్ము
లందుఁ బెరిగినారంట బాల్యాదినుండి.

నవ్వువారల దెసఁ జూచి నవ్వినట్లు
పిలుచువారలఁ జేసాచి పిలుచునట్లు
పలుకువారలఁ దలయూచి పలుకునట్లు
వ్రాసి యుమ చూపె నాకుఁ దత్పట మొకండు.

మెరయుమోము దృశించి మిత్రుగా శత్రుగా
మిత్రు లమిత్రు లున్మేషపడుదు
రెగుబుజమ్ములుదాఁకి పగఱకోటలయుక్కు-
గడియలు ధర నూడిపడఁగవలయు
వెడదవక్షము సోక బిఱుదైనదుర్గాల
కంచుకవాటముల్ కడకుఁదొలఁగు
గొనబుమధ్యముఁగాంచి కుప్పించి లంఘించు
కొదమసింగమె మాటుగోరుకొనును

వీరరసమెల్ల మూర్తిభవించినట్టు
లాతఁ డొకదివ్యతేజస్వి యౌ నిజమ్ము
ఇంతయూహించి చెప్పఁగానేల వినుఁడు
అచ్చముగ మీరలే యాతఁడనఁగవచ్చు.

అనవుడు స్వర్లోకధునీ
కనకసరోజముల మధువు కప్పకు లభియిం
చునె! వట్టి యభాగ్యుఁడు లె
మ్మని చోళుం డతి గభీరుఁడై తల(వ్రాల్చెన్

అతని పినతండ్రి యతని రాజ్యముననుండి
వెడలనడచినాఁడంట యే యడవులందు
నాతఁడున్నాఁడొ 'పాప' మా యబల వాని
తోడిదే లోక మని తాను గూడ నేగె.

చిక్కలేదేడ నాచోకి చిన్నమంత
'పాప' మా బాలకై తాన వ్రాసినట్టి
ప్రణయలేఖలు తత్ప్రియ ప్రతిమతోడఁ
గలవు నాచెంత వీరాగ్రగణ్య! చూడు.

అని కళింగేంద్రుఁ డందిచ్చు నప్పు డతఁడు
బాష్పగద్గదకంఠుఁడై పలుకురాక
శారదోరుతుషార వర్ష ప్రకంపి
తాధరోష్ఠాబ్జదళము వెల్లాపిఁకొనెను.

ఆపఁగాఁ దనవాలుచూపులాతనిచూపు
లొక్కటై నూత్న భావోదయమ్ము
గలిగింప గద్గద కంఠమ్ము సవరించి
పై కుబ్బు నురమున వల్వఁ గప్పి

ప్ర భా త ము

చేసమాలునఁబుచ్చి చెక్కులఁ జిఱుఁజెమ్మ
        నెమలిపచ్చతురాయి నివిరి నిలిపి
జిలుఁగైన గద్దియ చేరువగా లాగి
        కొని కళింగేంద్రుఁ డల్లన వచించు

'నల్ల చెంగల్వ డిగ్గియ కరిగి సపుడు
చలువ సురపొన్న నీడ లేఁ బలిరుసెజ్జ
మెసయుమన్న నీదంతపుం బరిణఁ గంటిఁ
జూడుఁ డీగడ వెడలునో సుంత మీకు.

అనుచున్ దంతపు బరిణను
వినయ వినమితోత్తమాంగ విధితో నతఁడా
తని మ్రోలవెలయు బల్లప
యుని దీవియ ముందు నునిచె నెంతయుఁ బేర్మిన్.

తీగెలు లేఁజిగుళ్లు నులివేరని పచ్చనియాకు జొంపముల్
మూఁగిన తుమ్మెదల్ విరియుమొగ్గలువిచ్చిన పూలగుత్తులున్
గ్రాఁగిన పండుటాకులును గాయలు పిందెలు పండులెల్ల నా
రాగుఱుతించిరందు నవరత్నపు రవ్వల స్వర్ణరేఖలన్.

అనఘగోదావరీ ఘనతరంగతురంగ
        దమలశీకర సైకతస్థలమ్ము
అరుణద్యుతి స్ఫురచ్చరణ హంసానీక
        మలవ్రాక నీదు చెంగలువ కొలఁకు

భస్మప్రియాపురీ బాహ్యోపవన భూమిఁ
బొడలుచల్లని సుగంధ్యసీడ
నఖరాగ్రలూనానవస్వాద కలితముల్
ముంగురుల్ కడకొత్తు ముద్దుసాబగు

అంకపాళిన్ శయించిన యతివచేతి
జీవకళ లుట్టిపడుచున్న స్వీయపటము
పరను రమణీయ దంతపుంబాణి యుడియఁ
జోళదేవ్రుని దృష్టిలోఁ గ్రేలె నపుడు.

పటిమఁవారిన హృదయంపు బాధనెల్ల
దాఁచినను దాఁగనీని హస్తద్వయంపు
వడవడవడంకుతో మాఱు పలుకకుండ
గుబగుబ చెమర్చి యతఁడు కైకొనియె బరిణ.

అది యొకానొక పన్నిదమ్మందుఁ దనకుఁ
బ్రాప్తమైనట్టి బహుమతి; యదియె నాఁడు
ప్రణయభిక్షుగ నుమ కోరి పడసె; నిదియె
తలఁపునం బారి స్తబ్ధుఁడై నిలిచె నతఁడు.

నిలఁ దన తెలివాలుం జూ
పులు కలకలఁబఱపి బరిణమూఁత విడుం డం
చెలనవ్వోలయఁగఁ బలుకుచు
బలిమిని వెడలింపఁజేసి పక్కన నగియెన్.

నగినఁ జోళదేవుఁ డగణితభాధతోఁ
గనెఁ గళింగునాతఁ డనె మహాత్మ!
బరిణలోనిలేఖఁ బైకిఁ దీసి పఠింపుఁ
డింత చాలు నన, గ్రహించి విప్పి.

తఱపివెన్నెల పచ్చికెరటాలనిగ్గులు
ప్రియవధూదరహాస రేఖ లగును,
జిఱుసానగొన్న సంజీవినీ కళికలు
కల్యాణిముగ్ధ వీక్షణములగును,
దీరుఁదీయని తేటతేనె పూమొగ్గలు
ప్రియతమాప్రేమ వాక్శ్రీలె యగును,
గలిగినకనుల కఖండ పుణ్యజ్యోతి
ప్రణయినీ ప్రణయ సంపత్తెయగును,

జతురుదధిమేఖలా పరిష్కృతదిగంత
మధ్యవిలసిత ప్రాజ్య సామ్రాజ్యపదము
నామధుస్వరూపిణి! యో నాయుపాస్య
దేవత! యుమాకుమారి! నా కీవ యాదు.

అని మెలమెల్ల మున్ను తన హస్తమునన్ లిఖియించి యున్న లే
ఖ నలరు పద్యమున్ జదివి కంఠగతాశ్రులతోడ నాగఁగా,
వినను బరాకు వచ్చె సుఁడి వింతగ, నేదిమఱొక్కమాఱునే
వినవలతున్ బఠింపుఁడని వేమఱు వేఁడి పఠింపఁ జేయుచున్.

ఏది మధుస్స్వరూప, పయినేది పఠింపుఁ దుపాస్యదేవ, యే
దేది భ్రమించితప్పు వచియింపనుగాదో? తదీయచిత్ర మే
దేది యిదేమి మీఁకువలెనే కనుపట్టెడు నాదుదృష్టి కీ
మాదిరి-యంచు మేనఁబోడమన్ బులకల్ కనుచున్ గళింగుఁడున్

ఏమి యోజింతు రాతని యీఁగడింత
యెఱుఁగుదురో దాఁపగావల దిదిగో మీర
లొట్టు నాతోడు సుమ్మంచు నొత్తి యొత్తి
యతితర మ్మైనయట్టి దైన్యమున నడిగె.

అడిగినఁ దారుమాఱయి స్పృహన్ నటియించి యసత్యశంక నె
క్కుడు హృదయమ్ముజంకఁ దనకున్ నిజమాడఁగఁ గొంకువుట్ట న
య్యెడ మిఱిచూపుతోఁ గలఁగియేమఱియుండఁగ వానినోటవే
వెడలెఁ దనంత 'ఆ' యనిన వీనులవిందు మరందబిందువై.

ఆసమయమ్మునన్ నిజసభాంగణసీమను దుందుభిధ్వనుల్
మ్రోసెను వందిమాగధుల భూరిజయస్తుతి దివ్యగానవి
న్యాసరవమ్ములున్ వెలసె నయ్యవి వించుఁ జెలంగి చోళున
గ్రేసరుఁ జేసికొంచు నరిగెన్ సభ సేయఁగళింగుఁ డంతయున్.

# ప్రభాతము

## ఏకాదశ ఖండము

ఉదయభానుకిరణయూథమ్ము లత్తైత్తి
నింగినెగయఁ బ్రాక నిలిచియుండె
మిత్రుఁగొట్టి వెలుఁగు మిహికాంశువసువులు
వారుణీప్రసక్తిఁ జారుచుండె.

తలపైని నెమలి కుచ్చుల తురాయీపాగ
యొకప్రక్క కొఱఁగిన యొప్పుతోడఁ
గ్రొంగొత్త చిఱుఁజెమ్మ గుబగుబ నుబికెడు
లేముద్దుఁ జెక్కిళ్ల గోముతోడఁ
దడఁబాటుఁగొనుచుఁ బాదము లుంప జారెడి
సమ్మోళిగల వింతయొమ్మెతోడఁ
గరడుగట్టిన ప్రేమ కరఁగి యుప్పొంగు ఱొ
మ్మున నూఁగువలెవాటు మురువుతోడఁ

జోళుని కరమ్ముఁ దనదు కెంగేలఁగొనుచు
పొంగిపోవుచు వచ్చి కళింగ భర్త
రాచ దర్బారు కప్పుడు వేచియున్న
రాణువన్ గాంచెఁ దనహజారమ్మునందు.

కనినయాచూపులో నెట్టి క్రమసుశిక్ష
కలదొ సైన్యమ్ము పాయలై మలఁగిమలఁగి
శ్రేణులన్ గట్టి జోహారు చేసి నిలిచి
యతని కనుసన్నయాజ్ఞకై యరయుచుండె.

తత్పురస్సింహపీఠికఁ దా వసించి
నికటపీఠికఁ జోళుని నిలిపి, యపుడు
సమరనిర్బంధి యా క్రూరశత్రు నటకు
నర్హదండన మిడఁగఁదె మ్మనె నతండు.

ఆమాటకు సేనాపతి
మోమున వినయమ్ము మిగుల మొలవఁ దదీయ
శ్రీమహితదృష్టినిపత
ద్భూమికి నొకకొంత తొలఁగి మ్రొక్కి వచించున్.

ఓదేవా! తమ యంగులీయకము నీయోధుండు మాకిచ్చియా
జ్ఞైదీనిన్ విడువంగ దేవర మహాజ్ఞన్ దెల్ప మే మట్టులే
యాదుష్టారిని వీడినార మిది యాథార్థ్యమ్ముకాదా? యితం
డీ దౌర్భాగ్యము సేయునా మముఁ బరీక్షింపన్ భవద్యత్నమో?

నడికి రేయి వచ్చి యొడయని యాజ్ఞ మీఱ
రడలవలదు ఖైదు విడుఁడటంచు
ననఁగ విడిచిమరిని, నంగుళీయకముం డె
సాక్ష్యమగుచు దేవ ! యరయుఁ డనఁగ.

హృదయము జల్లనె మొగమం
దుదయమ్మయ్యెన్ గ్రుధానలోజ్జ్వల కాంతుల్
గొదగొన్న పెద్దపులివలె
నదుటున లేచెన్ స్వపీఠినుండి యతండున్.

సమరనిర్బంధియగు క్రూరశాత్రవుండు
పాఱిపోయెనా ! వానికి బాసటైన
యాతఁడీ యోధనాథుఁడా ? సాక్ష్యమంగు
ళీయకమ్మున్నదా ? విచారింపవలెన ?

అనుచు నుచ్చైస్స్వరమ్మున నదియ తిరిగి
విన్నవారలు వినువారు పిడుగుదాఁకి
సుడిసిపడిపోవునటు కళింగుఁడు జ్వలించి
పలుకు నాశ్చర్యమును బొందు నులుకు లోన.

ఒక క్రీఁగంటఁ బ్రియానురక్తిమము లాయుర్వృద్ధిఁగాంక్షింపవే
ఱొక క్రీఁగంటఁ గ్రుధానురక్తిమములాయుఃక్షీణమాశింపఁజూ
డక యే చూచుచుఁ జోళునిన్ బొమలనిష్టప్రాయకార్యమ్ము తె
ల్పక తెల్పంగఁ గళింగుఁడప్పుడనియెన్ లక్షించి భావ్యర్థముల్.

ఓ వీరాగ్రణి! మా చమూపతి సభన్ యుష్మత్ప్రతాపమ్ము ప్ర
స్తావింపన్ దమ కస్మదీయరణపూజాహ్వానమున్ బంపినా
మావిజ్ఞప్తి ననుగ్రహించి తమ రత్యంతమ్ము విచ్చేసి మీ
సేవాభాగ్యమొసంగినారు విజయ శ్రీదేవికిన్ గాన్కగన్.

మాకున్ బ్రత్యుపకారబుద్ధిఁ బ్రకటింపన్ రామి, యుద్ధావనిన్
మీకున్ మాకనకాంగుళీయకము సంప్రీతిన్ సమర్పించి నా
మాకల్యాణకరోపదాకరణ మిట్లై మీదికిన్ దూకునా!
కాకీ మాసభవారు దోషిగ మిమున్ గల్పింప యత్నింతురా!

ఏమో మేమది విశ్వసించుటెటు? మీయీబాహుదండప్రచం
డాముష్యాయణ సత్కృపాణవరణమ్మాశించి మేముండఁగా
ఓమాన్యా! యిటులౌనె? చూపుడది యీయోద్దోలగమ్మందు మీ
తోమాలమ్మగు మీకళంకమును బ్రక్షాళించుకో నయ్యెడిన్

యోధపతి యంగుళీయక మున్నఁగాని
నిన్ను రక్షింపలేదు మా నృపతినీతి
క్షత్రియుల కప్రతిష్ఠ శీర్షమ్ము పోక
ఋజువు గల్గిన నిమ్ము పరీక్ష మాకు.

ఆప్రఫుల్ల విశాల నేత్రాంచలమ్ము
లామహానందమంద హాసాననమ్ము
చెక్కుచెదరవు చోళుండు చిన్నవోవఁ
డాతఁ డొకదివ్య తేజస్వి యట్లులేచి.

ఓ కాళింగవిభూ! జోహారు, తమ రభ్యాహించి నామేల్ యశ
శ్శ్రీకిఁ మేలిమెరుంగు లద్దికొన నఁ బ్రేరేచుచున్నార లీ
మీ కల్యాణహితోపదేశమునకుఁ మేన్ బొంగు సంతోసపు
న్వాకన్ దేలు నెడంద మిమ్ముఁగని ధన్యంమన్యుఁడఁ నేనిటఁ

మీరొక దేవతాంశమున మేదినికిఁ దిగివచ్చి యీజగ
చ్చారుకళాలయమ్మునకు సంస్కృతిఁ జూపుచునున్న సత్కళా
వీరులుగాని వట్టి పృథివీపతులా? యిటువంటిమీచమూ
వారములోనఁ జేరిన యభాగ్యుని నన్ క్షమియింప వచ్చునా?

నాపై మోపిన నేరమియ్యది ప్రభూ! నాకుఁ బ్రియమ్మైనదిఁ
కీ పాపిష్ఠికి సానుభూతివల దాయీసాక్ష్యముల్ వద్దు శి
క్షాపాత్రుండితఁడంట నిక్కవము, తాకార్యాణమ్ము వేఁజేల? వ
ద్వ్యాపారమ్మునకుఁ సమీక్షితగ దార్యా! యింక మీమ్రోలనుఁ

తే॥ నామనోభీష్టముఁ నేను నడిపికొంటి
వధ్యశిలకును రాత్రియే వదలుకొంటి
నాదుప్రాణాలు, తత్కారణమ్మొకింత
నుడువఁ బడ దింక నన్నది యడుగరాదు.

ఏవంవిధతచ్ఛోకదృ
ఢావిర్భూతాపరాధమగుపలుకున కెం
తో విస్మయపడి నిశ్చే
తోవృత్తిఁ గళింగుఁ డపుడు త్రొక్కినపడుచున్.

ఓ చమూనాథ ! మాయుగ్రదండనము నీ
వెఱుఁగవొ సామాన్యమే, విదిల్చి
బరిమీఁది కెక్కించి పఱియలువాఱ మేఁ
గడికండలెల్లఁ జెక్కంగఁబడును
నిలఁబెట్టి నిలువునఁ దలమీఁదనుండి క్రిం
దికిఁ బెద్దగసికలు దింపఁబడును
భగభగమండు వెన్నెగల కంబముఁ బరి
ష్వంగమ్ముఁ జేయింపఁ బడును జుమ్ము

యోచనమ్మింత లేక మీ రొప్పినట్టి
నేరమును రూపుమాపుకో నేరకున్న
భయదమై పోవు మాయాజ్ఞ, ప్రథనభూమి
మీరుగొన్నట్టి కాన్క చేజారెనో కో?

అనినఁ జోళుఁ డతని వ్యంగార్థ మెఱిఁగియు
ఓ ప్రభూ ! యథార్థ మొప్పికొంటి
నన్నృతపాపదండనాళికి మీదండ
నములు పోల్ప నల్పతమములగును.

మీనృపనీతికిఁ దగిన
ట్లే నను నర్పించెదర మదిందువచశ్శ్రీ
లోనఁ గళంకము లేదో
భూనాథ ! యటంచు మౌనముద్రితుఁ డగుఁడుర.

ప్రభాతము

కనులన్ నీ రుబుకన్ గళధ్వని వణంకన్ మేను గంపింపఁగన్
దనయాజ్ఞన్ వెడలించె భూపతి మహాధాత్రీ ధరాగ్రాశని
స్తనితప్రాయముగాఁగ యోధపతివక్షశ్ఛేదనారూపమున్
విని కొల్వెల్ల శిలాస్వరూపమెనయన్ బీభత్సమై మిక్కిలిన్

తనముందున్న తుపాకిని
దనచేఁగొని యెత్తిపట్టి తనజోదులవం
కనుగని కళింగభూధవుఁ
డనియె నపుడు ధీరమంధరారావమునన్

ఈ తుపాకిని బార్వెట్టి యితనివక్షు
మిచటఁ దూట్లుగఁ గొట్టఁగా నెవనియెడఁద
విపులధైర్యమ్ము కలదో యావీరయోధ
యిది గ్రహించుత మాభక్తి విదితపడెడు.

ఆ కళింగు మాటనాలించెఁ గొలువెల్ల
ముందు కొక్కరుండు మ్రొగ్గ లేదు
ముదుకఁడొకఁడు మాత్ర ముదుటునఁ జని భూమి
పతికి మ్రొక్కి తాఁ దుపాకిఁ గొనియె.

రక్తవర్ణవిశిష్టమై ప్రజ్వలించి
యంతనంతఁ గళింగుని యాస్యమండ
లము హఠాత్తుగ మాఱెఁ గళావిహీన
మై వివర్ణమై నయనబాష్పార్ద్రమగుచు.

ఓయి! ముదివగ్గు! నిలునిలు మొక్కమాట
ఆ మహావీరువక్షు స్సయోమయమ్ము
కాల్చుట కశక్య మగు, నీవు కాల్పఁజాల,
వైన, నీకేల యాయఘు, మ్మేన కాల్తు.

ఇతని తప్పిదమున కింతట విడరాదు
చిత్రవధము నితనిఁ జేయవలయు
నీ సభాలయమున నేకాకినై సేతు
నంగణమున కందఱరుగవలయు.

ఓయి ముదుకఁడ! మాసేన నున్న వాఁడ
వాదువా? నీవు, నిన్ను నే నరసినట్లు
లేదు, నిండుపౌరుష మన్న నీది, వీర
లెల్ల వట్టికోఁచలు, నీవు నిచట నిలుము.

అని కళింగుఁడు తత్సభ నంగణమున
కనిపి, మృత్యుభీకరముఖ గహ్వరమున
కనుపఁదలఁచి చోళుని సమాయత్తుఁ జేసి
భయదరీతిగఁ దాను దుపాకిఁ బట్టె.

మృత్యుదేవికి స్వాగత మ్మిడెడి పోల్కిఁ
దన తుపాకికి గుఱిగ ముందఱ వెలుంగు
చోళపతిశాంతసౌజన్యసుందరాక్షి
నలినములఁ జూడ్కి తేఁటులు నిలిపి నిలిపి.

నిలుము శస్త్రజీవి ! యొక్క నిమిష మేను
సమయ మిచ్చెద నీవాంఛ జరుపుకొఱకుఁ,
గలదొ సందేశ మేదేని దెలుపు, మవని
నీకుఁ బ్రియతము లొక్క రేనియును లేరొ ?

శ్రీకులోత్తుంగ చోళధాత్రీమహేంద్రు
మీర లెఱుఁగుదు రాతఁడు మీరు కారొ ?
మృత్యుతల్పానుశాయి యసత్య మాడి
యనుభవించున దేమి టీయవని నింక.

అనవుఁడు శోకతప్తహృదయాంతరశోణిత ముబ్బి మోమునం
గనఁబడ 'నేమహాత్మునరిగా సమరాంగణసీమలోన బం
ధన మొనరించియుంటిరొ యతండు మదిష్టతమ ప్రభుండు త
క్కిన జగమా కుటుంబ మపకీర్తివహించిన వాఁడనందులో.

కఱకుఁ దుపాకిగుండ్లు గుఱిగా మడియింపుఁడు భస్మరాశితో
దురితము తూలకుండినఁ దతో జగతిన్ బహుదుఃఖజీవినై
తిరుగుదు, నొక్కవ్యక్తికి దిదృక్ష యడంగదు వధ్యభూమిలో
నురికెడివేళ, నీచిరవియోగి సుఖించున దేమి లెమ్మిఁకన్.

అడిగినవారు చోళుని యుదంతము వాఁ డపరాధియై యిదే
మడియునటంచుఁ జెప్పెద, సుమాసుతయున్ మదిలోననట్లు లే
కడుఁదలపోసియుండుఁ జిరకాలమునుండి, యకాండరీతి ని
ప్పుడు తలవెట్టి తత్ప్రియునిపోలిక నామెఁగలంచుటొప్పునే ?

ఆమె శిరీషకోమలహృదంతర, తత్ప్రియువార్త కంటకో
ద్ధామపవిప్రఘాతము, వృథాశ్రమ, తత్ప్రియసోదరున్ మదిన్
బ్రేమ వహించి పొంది తదభీష్టసుధాలహరీతరంగడో
లామహనీయవైభవములన్ గనుటొప్పు సురాజ్ఞివై యికన్

అనిహృదయమ్ము కందునటులాడఁ గళింగుఁడు వృద్ధసైనికున్
గని యిదు నీ తుపాకితని కంచుఁ గసిన్ వచియించి వేగఁగై
కొనుమదియోధుఁడా! ప్రభునకుంజవదాటకు మొండు రెండుమా
డననుఁ బ్రేల్చుమింక సుఖమందుదమిర్వుర మొక్కమాఱుగన్.

కొనుము తుపాకి యియ్యదియకుంఠ విరోధిశిరోగ్రదివ్యభూ
షణముకుటాగ్రకోటిమణిసంభృతపాదకళింగసార్వభౌ
మునిఘనశాసనమ్ము, చనిపోవుచు నీవు వినీతిశాలివై
చను మిది శస్త్రజీవికి యశస్సు, వృథా పలుమాటలింకిటన్.

అనిన సర్వాంగకమ్ములు వణఁకుచుండఁ
జేయునది లేక చోళుండు చిన్నవోయి
పుచ్చుకొనెను దుపాకి కీల్బొమ్మపగిది
బ్రదుకు బరువనిపింప విషాద ముడిగి.

మును బంగారు జిలుంగుఁబూలకపురంపుందావులన్ స్నానమా
డిన యాభోగులు ఘోరయుద్ధజలధుల్ డిండీరముల్ గట్టఁ ద్ర
చ్చిన యాయోధులు రాజనైతిక యశశ్శ్రీకోసమై ప్రాణముల్
తృణమట్లీయఁగనుండిరప్పుడు మహామృత్యూగ్రదావార్చికిన్.

పారములేని వెన్వగఁ, దుపాకిమొనన్ ధరమోపి, వేఁడి ని
ట్టూరుపువుచ్చి యుస్సురని యుమ్మలికంపడి తత్కళింగకుం
డారణయోధుపాదములనంతఁ జివాలునవ్రాలి వింతగన్
మాఱిన గద్గదస్వరమునన్ గనులన్ దిరుగాడ నశ్రువుల్.

నేనొక యర్థనారిఁ గరుణింపుఁడు నన్నుఁ, గళింగనాథుఁడన్
గాను, మదీయనామమునఁ గల్పితపుంస్త్వము నింతకాలమున్
గానరు, మీదిదృక్షకొఱకై వెలివుచ్చి వచింతు ధైర్యమున్
బూనుఁడు నాథ! రాట్పురవిభూ! దురదృష్టము దాఁటలేమిఁకన్

నినుఁగనుఁగొన్న వేళల
    జనించిన పుల్కలుమాఱుపాటునన్
జొనిపి మహాత్మ! యిందనుకఁ
    జొక్కితి, యుద్ధము సేఁత కింతవ
చ్చునొయొకవిఘ్నమంచుఁ,
    దుదఁజూడఁగవచ్చును భోగభాగ్యముల్
మనమలరంగనంచు నిటుమార్పు
    ఘటిల్లుటకే మెఱుంగుదున్.

నా హృదయమ్మునందునఁ దొణంకుకవోష్ణపు రక్తధారలే
మోహాను నేమహామహావిభున్ గని దోహదమంది యింతగా
నాహవరంగమందు నభియాతులకున్ గడుభీతిఁ గొల్పెనో
యోహృదయాధినాథ! యవియారకయే వరియించునే పరున్.

ఈ కఱకుందుపాకి జనియించెడి రవ్వలౌనా కరమ్ములా
నీ కఱకుందుపాకిని జనించెడి రవ్వలె నీ కరమ్ములా
ఈకరముల్ పెనంగ జనియించెడి మంటలె ప్రేమచుంబనా
నీకములౌను మీఁద మరణించుటె యిర్వురికేళిసౌఖ్యమా.

ప్రేల్చుఁడు ప్రేల్చుఁడంచుఁ ద్వరపెట్టు
నుమాసుతమోముఁ దమ్మిలో
నిల్చి చలింపనేరని కనీనికలన్
మధుపాలినెంతయుం
బిల్చెను బుజ్జగించెను శ్రమించెను
జోళుఁడు నిష్ఫలమ్మగా
వ్రాల్చి తుపాకి 'పాప' మవి రావు
సుఖించునొ యేమొ యచ్చటన్.

నిదురంబోవుచుఁ గల్వరించునటులన్ నీవా యుమాబాలవౌ
దౌ దురాపా! 'యవుదున్ గనుంగొనఁగరాదో నాథ! కోటీరమే
నిదె నాయాదలఁ దీయుదున్' గటకటా! యీజీవి కీపాటులా!
తుదకీ మత్ప్రియహత్య, నాకిఁకను జేతుల్ రావు దుర్దైవమా!

అనుచుఁ జోళవిభుఁడు హాహారవమ్మునఁ
గనులవెంటనీరు కాల్వగట్ట
శుష్కహృదయుఁడగుచు శూన్యదృక్కులతోడ
నుర్విఁగూలఁబడియె నుమయు నంత.

ఏల వగచు టిపుడు లేలెందు మీబేల
తనముఁగాంచి నవ్వుకొనును దాత
సకలరాజ్యలక్ష్మి శత్రువుపాల్సేసి
వనులముక్కుమూసి కొను టెలెస్స ?

మీకొసమైకదా యీకళింగప్రాజ్య
రాజ్యలక్ష్మికి నేను ప్రభుఁడనైతి
మీసేవకై కదా వేసమ్ముమార్చి త
ద్గిరి వనప్రాంతాలఁ దిరిగియుంటి
మీప్రాప్తికై కదా మీయాశ్రమస్థలీ
వాసమ్ముఁ బలుమార్లు చేసియుంటి
మీదురాజ్యమ్ముకై కాదా కళింగేంద్రు
భటుఁడనై మొన్న నే వచ్చియుంటి

లెందు దేవ ! యంగుళీయకమెచటనో
పోయె నంచు మీరు బొంకఁ డంత
పాప మేమి రాదు, పాపిష్ఠిపినతండ్రి
వంకఁ దగిలి యింక వగపు విడుఁడు.

అనినఁ జోళదేవుఁ డాశ్చర్యమున లేచి
యెంత కార్యమాచరించియుంటి
వీవు నిజము నాదుహృదయసామ్రాజ్య రా
జ్ఞి వెసుమ యని దృష్టినిలిపి చూచి.

బొంకుబొంక నాకుఁ బోలదు పినతండ్రి
వంక భక్తి నాకు జంకిపోవ
దతనియిచ్చయెట్లొ యట్టులే సాగుత
దీని ననుసరించి తెలుపు మనఁగ.

పగవానిఁ బ్రేమింపఁ దగునో; తగుఁగాక
వానినే ప్రేమించువాఁడు ఘనుఁడు;
హితులఁ బ్రేమించుట యెప్పుడో; ప్రేమింప
కుండిన హితు లెట్టులుండువారు;
ప్రాణాపదల్ వచ్చునట్ల బొంకుట లెన్న;
యసలు బొంకుట కెప్పు డదను గలుగు
నిపుడిర్వురకు మనకిటుఁ దప్పదా? మృతి;
యెట్టులు మీయాజ్ఞ యట్టిదేని?,

ఇల్లువాకిలి వదలి నే నింత వడుట
యెందులకొ మీర లెఱుఁగరా? యెఱుఁగువాఁడ;
మీదుప్రాణా లమూల్యముల్ మేదినీప్ర
జాళి; కౌనుకావచ్చునేమగును జెలియ!

ఒక్క బొంకు బొంకుఁ ఉర్వి నేలఁగ వచ్చుఁ
బిన్న తండ్రి నెత్రుఁ బీల్చవచ్చు;
నది సహింపనొనె? యణుమాత్రమును గాంత!
సత్య మింత నాథ! సత్య మతివ.

కొనుము తుపాకి లెమ్మికనకుంఠ విరోధి శిరోగ్రదివ్యభూ
షణమకుటాగ్ర కోటిమణి సంభృతపాద కళింగసార్వభౌ
మునిఘనశాసనమ్ము, చనిపోవుచునీవు వినీతిశాలివై
చను మిది శస్త్రజీవికి యశస్సుమ గానిక నేనుయోధుఁడా

అని యుఱిమె సజలజలధర
ఘన నిర్భరగర్జగా నకాండత నతఁడుఙ్
జెనుగంప మడరఁ బట్టెను
దనహస్తమునఙ్ దుపాకి దడదడలాడఙ్.

మాటవ్రాయెను గంపమ్ము మాటుమణఁగె
నెగసె మోహమ్ము బాష్పమ్ములింకె, నాత్మ
సుందరీమారణోద్యోగిచోళదేవ
నిస్వతంత్రుఁడు బార్వెట్టి నిలిచె మిగుల.

అక్కనఁ గుదించి డాకేల నదిమిపట్టి
కుడికరమ్ములూది, తుపాకి గుండ్లు కవుడు
గుఱిగఁజేకొని తమ పేరుటురము లచటఁ
బటుత నిల్చిరి పుణ్యదంపతులువారు.

వృద్ధుఁడంత ఱెప్ప వేయక వారల
వంకఁ జూచి చూచి జంకుఁగొనక
రొక్కదూకు దూకి యువకుల మధ్యకు
వెసఁ దుపాకు లెత్తెఁ బ్రేలె నవియు.

మ్రోగెఁ బ్రహ్మకరండముల్ పగిలెనో
భూమీభృదుచ్చైర్మహో,
భాగాగ్రోపలసంఘముల్ విఱిగెనో
పాథోధికల్పాంతసం,
వేగోర్మిఘనసంచయ మ్మెగసెనో
విద్యుత్సముద్యద్వియ,
ద్యూభాగోళాంతర వాయువుల్ రగిలెనో
పోల్పంగరాకే ధ్వనుల్.

# ప్రభాతము

## ద్వాదశ ఖండము

ఈ మేఘగర్జ యేమీ ఱేనిపై దోషి
పడియెనో యనిలోన భయముపడుచు
ఈ మహార్ణవఘోష యేమిటి యపరాధి
యెదిరెనో యని లోన నదరిపడుచు
ఈ రణదుందుభి యేమి దండ్యుఁడు నేత
పై దూకెనోయని వణఁకుఁగనుచు
ఈ ప్రళయధ్వని యేమిటి శిక్షార్హుఁ
డవిధేయుఁ డయ్యెనో యని తలంకు

చంగణమునందు నున్న వారంద ఱాయు
మాకులోత్తుంగచోళ దేవాకులప్ర
కారభూమి కాకలితతద్ఘనసభాంత
రాళమును జొచ్చినారు శీఘ్రమ్ముతోడ.

ఒక కరమ్మునఁ దోడ నుమతుపాకిని బట్టి
వేఱు కేలఁ జోళవిభుతుపాకి
నాగఁబట్టి మధ్యనావృద్ధభటుఁడుండి
చూచువారు వెఱఁగు చూఱగొనఁగ.

నిలుఁడిక, మీ తుపాకులను నిల్పుఁడు, చాలు జయాభిలాష, లీ
కలుషికి నీనృశంసునకుఁ గాఁగలదెల్ల ఘటిల్లె, నో మహో
జ్జ్వల ! యువరాజ ! నిర్మల యశస్వివికమ్మ చిరాయువై, సతీ
తిలకమ ! సత్కులీనపతిదేవతవైతి జగమ్ము మెచ్చె నిన్.

ఏయవినీతు, దుశ్చరితు, హీనుఁ, గఠోరుఁ, బితృవ్యుఁ బ్రోవఁగా
నీ యువరాజు, స్వప్రియున కీయుమ యున్ దమ లేఁత ప్రాణముల్
వాయఁగనుండిరో యిపుడు 'పాపి' యతండిదె క్రూరచిత్తుఁ డా
శాయుత రాజ్యదుర్మద పిశాచము పట్టుఁడి కొట్టుఁడీ యిఁకన్.

ఓ కులోత్తుంగచోళదేవా ! కఠోరుఁ
డైన యీవిజయాదిత్యుఁ డన్న నింత
భక్తియా నీకుఁ, బైదూకు వ్యాఘ్రముపయి
మరులుగొనుదువే యెంత యమాయివయ్య !

కనులన్ బేరిన దార్మదాంధ్యకణికల్ కార్మబ్బులై, గొడ్డువో
యిన ప్రేమంపుటెడారినా యెడఁదఁ దండ్రీ ! యెన్ని పెన్మంటలం
టిన తీవ్రాశనికోటులన్ జిదిమెరా, నిర్దగ్ధమైనట్టి యీ
తనుకాష్ఠమ్మున కింకనైనఁ గలదా తా వింత శాంతింపఁగన్.

లేదు లే దని యందువా యాదిగంత
చతురపాంపతి మధ్య భూచక్రమందు
సరియె పోనిమ్ము సమవర్తి సన్నిధాన
తప్తతైలాంతమునసె శాంతము వహింతు.

లేదు క్షమార్పణమ్ము లవలేశము వట్టి కఠోరుఁడైన యీ
నీదుపితృవ్యచేష్టలకు నిష్కృతిగా భగవానుద్రోహాలఁ, దం
డ్రీ! దురితక్రియాఫలమిదే భుజియింతును నద్దురాకు మే
రేది యొనర్తు రద్ది భుజియింత్రు ప్రతిక్రియ దీని కింతియే.

ఎత్తున కెత్తునెత్తి సివమెత్తిన యీకలుషాధిదేవతా
చిత్తము నేఁటికా కరఁగెఁ; జేసినఘాతుక కర్మలెల్ల సా
కొత్తుగఁ దోఁచునల్లయవె,జల్దరిలున్ హృదయమ్ము,క్రౌర్యపుం
గత్తులు ప్రేమవజ్రఫలకమ్మున మొక్కలు వ్రాయెఁ దున్కలై.

అంతలు సేసి నిన్నడచు నప్పుడు నాసుతుఁ డడ్డఁబారి నన్
ద్రుంతునటంచుఁ జైకి నసిదూసెను దానికి నీతలొగ్గి, నీ
కెంతటి భక్తిరా పితపయిన్ వధియింపు మటంచునిన్ను, నీ
వెంతయుఁ బల్కినాఁడ విది యింత దలంచిన గుండె నీరగున్.

వాఁడుమదీయపుత్రుఁడు లవమ్మను నీపయిఁబడ్డఁ బ్రాణమీ
నోడఁడు నాకు నోడఁడది యొప్పక నిన్ బురినుండి గెంట, నే
తోడును లేని నీకు వలెఁ దోడనె నమ్మను నీదుతమ్ముఁ డి
స్సీ! డిగనాడి నాయెడఁదఁ జిచ్చిడిపోయెఁ బ్రవాసమేడకో?

కొడుకొక జాడగాఁ గడుపుఁగోఁత ఘటింప దురాశ పెల్లుఁ
నడరి సమస్తభూమివలయమ్మును నేలఁగఁజేయ, వేగుల
గొడిమ లెఱింగి సజ్జనుల గొంతులుగోసెడి నాయెడంద
క్కడియది ప్రేమయన్న నుడికారము నిల్వఁగఁదావునేఁ

నీ మహల్ వేఱుగా నిర్మించి నినుఁ జంప
        భటులను నడురేయిఁ బంపియుంటిఁ
జాపవిద్యాప్రదర్శన మని విషఖడ్గ
        హస్తులనీపైకి నంపియుంటి
మృగయావినోదార్థము గిరీంద్రములకంపి
        పొంచి బాణములు వేయించియుంటి
గంధమాల్యాంబరాక్షత లిచ్చుతెఱి విష
        భరితముల్ నీకు వేర్పఱచియుంటి

నన్ని నీతమ్ముఁగుఱ్ఱఁడే యడ్డుకొనుచు
నిన్ను రక్షించియుండెఁ గాకున్న నీవు
బ్రదుకుదువె తండ్రి ! యిట్టి దుర్మార్గునన్ను
నీవు కాకున్న నెవరు ప్రేమింతురయ్య !

అకట ! యవియేల ! నాచేతులారఁ గలన
ఖడ్గమెత్తితి నినుజంపఁ గడఁగి నిన్నుఁ
బరమ విషసర్పమునకును బాలువోసి
పెంచితివి రాత్రి విడుమరఁ బెట్టితండ్రి !

ప్రభాతము

అవి యెల్లఁ దలపోసినా యెడఁద
ప్రత్యంబారుచుఁ రక్తముల్
స్రవియించుఁ జ్వాలదగ్ని తాపిత సహస్ర
స్ఫారసూచీ హతుల్
కవియుఁ మత్ప్రతిరోమ కూపమునఁ, గన్యా!
పోటులుఁ మంటలుఁ
రవులఁ జొచ్చెఁ ద్విజింతు నేనిఁక సమర్థ
మ్మైన మజ్జీవముల్.

పరకేసరిప్రభు బలవంతపఱచి యీ
యమ నుమఁ గొనఁగ నాయత్తపడితి
ఈ యువమానతి దాని యెఱుకన యిటువచ్చి
పురుష వేషమ్ముతో ధరణినేలెఁ
బ్రకృతివర్గము భేదపఱచి యంతకుమున్న
యీ కళింగేంద్రుఁ జంపించియుంటిఁ
దత్పుత్రి విజయను మత్పుత్రుఁ డనురాగ
మునఁ జూచు కెఱిఁగి బంధనమునందు
నిడినవాఁడ, నీ యుమ యది యెట్లెఱింగి
యామెఁ గొనిపోయెనో నేఁటి కంతుదెలియ
దిన్ని సేసిన నాపయి నింతభక్తి
యాఁ? కలదె నాకుఁ బరలోకమందుఁ జోటు.

మడిసెను గళింగుఁ డీఁక సుత మడియకున్నె !
పడఁతి మగరూ పెఱింగి పైఁబడిన, నాకు
రాజ్యము కుమారునకు సుమారమణి దక్క
నంచుఁ దలఁచితి సబలనై యబల నిలిచె.

తలఁచిన నే నొకం డదియు దైవము వేఱతలంచె వక్రసం
కలితముగాఁ గథాసరణి కానఁబడెన్ దుద శాంతియిట్లుగా
నలవడి యింతనాకు హృదయంగమమయ్యెను బిడ్డనిన్గన
న్గలిగెడిభాగ్య మబ్బమికిఁగందును నాహృదయమ్ముమిక్కిలిన్.

కన్న మరు లెంత ఘనములు, కన్న కొడుకె
ఛీ యనుచునన్ను దవులఁ ద్యజించిపోయె,
వానికై చింతయేని యెంత భ్రాంతికగుదు
నెవ్వరిని ప్రేమగుణము బంధింపకుండు?

నాలుక లాగు లోనికిఁ, దొణంకును వా తెఱ లూది పల్కఁగాఁ
జాలను నంగుళీయక మొసంగి విముక్తుని నన్నుఁ జేయునీ
మేలున కీభటాకృతిని మేకొని నీ పురికంబ మెక్క నీ
పోలికఁబన్ని యి ట్లయితిఁబోలద ! యీకఠినాత్మకింతయున్.

మధురముగ్ధుండవై భద్రకుధరవనులఁ
బ్రణయనైరాశ్యగీతముల్ పాడికొనెడి
నీ వలన లేదు వెఱ పీయుమావిధమ్ము
భావమున కెక్కి కటకటంబడుదు నేను.

ప్ర ప్రభాతము

అవి ప్రజలాడుకొను భాషలనుబట్టి నేర్పున
రాష్ట్రమ్ము లెల్ల నిర్ణయమొనర్చి,
ప్రసః రాష్ట్రమ్ములను మండలములుగాఁ జీలిచి,
మండలమ్ముల నుపమండలములు
కవి గా విడఁదీసి, తద్ఘనసీమపట్టణ
సమితి వేర్పఱచి సంస్థానములుగ,
రవ్ర సంస్థానముల గ్రామసంస్థలక్రింద వి
భాగించి, యర్హులౌవారినెల్లఁ

పర దత్తదధికారముల సమాయత్తపఱచి,
మెచ్చి యెఱవైచి పౌరవులు పుచ్చి, నాకు
నలవిపడకయ, కడలసైన్యాళి నిలిపి,
ఈ ప్రభువ యీమె గాఁ దా నేలుబడిని జరిపె.

ప్రబః ‘ఈశావాస్యమిదం జగత్తనుచు నెన్నేమాఱు లీనోట దు
ష్టాశాపూర్ణమనస్సుతో నుడువనే, యప్డింతగా నంతరా
దత వేశం బబ్బక దాని సత్యమిటులావేశించెనే, చూడ రా
జ్యాశల్ స్త్రీసుఖముల్ మనోనయనమాయాదర్పణాంతర్నిధుల్

నిడి కుమ్మరసారెగా సకల గోళములున్ దిరుగన్ దిశావకా
య శమ్ముల కెవ్వఁడో గతినొసంగి చలాచలుఁడై యజాండభాం
దిగి డమ్ములఁ బూర్ణుఁడై వెలుపలన్ బయలన్ గనుపట్టుచుండువాఁ
యః డమ్మహనీయమూర్తికిఁ గృతాంజలి నయ్యెద నర్హశిష్యకై.

అని విజయాదిత్యుం డటఁ
దన మొలపిడిబాకు దూసి తనవక్షముఁజ
య్యనఁ బొడిచి కొనఁగఁబో నా
తని హస్త మ్మొడిసిపట్టి తదుమాచోళుఁడ్.

ఓ పూజ్యా ! తమపాదమాన, యిదిమీయుష్ణాంగరక్తోరుధా
రాపాతమ్మున స్నానమాడి తనధర్మజ్యోతి నెంతేఁ బ్రతి
ష్ఠాపింపన్ దలకొన్న, మేము వెనువెంటన్ మాడుకాక్షేయధా
రాపాతమ్మునమున్గి నిల్పెదము ధర్మజ్యోతులన్ మావియున్

అనుచువారలు కృతనిశ్చయమ్ముతోడ
నున్నవేళను నచటికి నుద్దవిడిని
విజయయును సోమదేవుఁడు విపులజనము
పాయవడి దారియిడ వచ్చిపడినవారు.

పశ్చాత్పరీతాప నిశ్చల హస్తాసిఁ
బై కెత్తి పొడుచుకోఁ బరగుతండ్రిఁ
దత్ఖడ్గ మొడిసి హస్తద్వయిన్ బెనఁగుచుఁ
దివియు నుమాచోళదేవవిభులఁ
దద్దృశ్యమున కాత్మఁ బెద్దగా నడలుచు
ననిమేషులై చూచునట్టి జనము
మనరాజు రాజ్ఞి యూ? కనకాంగుళీయక
మెట్లబ్బె నని వెఱఁ గెనయుసేన

నరసి వారలు దిగ్భ్రాంతులైనవారు
వారిఁ గని పిన్నతండ్రియు వదలెఁ గత్తి
ననుజుఁ బరిరంభ మొనరించె నగ్రజుఁడు, దుమ
విజయుఁ గౌఁగిలిఁగొనె నీవు విజయ వనుచు.

ఆనందాంబుధిపొంగి మిన్నొరసెఁ,
దూర్యధ్వానముల్ మ్రోసెఁ, గ
ల్యాణాహ్వానజయోల్బణప్రణవ
శంఖారావముల్ సేసి సే
నా నిద్రాళుముఖద్యుతుల్ విరిసె,
బ్రీణస్విన్నమాధుర్యను
శ్రీ నిండారె యువప్రమోదతరళ
స్మేరాననాబ్జమ్ములన్.

కరయుగమ్మును విప్పి పరిరంభమాశించి
గనులఁ గృపార్ఘురుల్ తొనఁకుచుండ
'నాతండ్రి! రావయ్య నాముద్దుఁగుఱ్ఱఁడా!
యని విజయాదిత్యుఁ డలరి చీరె,
సోముఁ డగ్రజు వంకఁ జూచుఁ బోవం; డింత
కసటేల తండ్రి! యీముసలిమీఁద
నన్నయ్యయనుమతి నందిదే రావయ్య
నీవైననో చోళదేవ! తండ్రి!

యంపుమీ కన్నపట్టి ముద్దాడికొందు,
ననఁగఁ దమ్ముని నతఁడు వేనంటఁబట్టి
తండ్రిపదముల మ్రొక్కించి తాను మ్రొక్క
నిరువురిపయిఁ దదశ్రువుల్ ఝరులుకట్టె.

అంత విజయయు నుమయును నతనిపదము
లంటి మ్రొక్కిరి వారల నల్లఁజూచి
చోళదేవు ప్రక్క నుమను సోమదేవు
నండ విజయను నిలిపి కన్నారఁగాంచి.

శారదచంద్ర చంద్రికల సా
    రములై కపురంపుదీవ్వులై
తేరిన కండచక్కెరల తేని
    యలై తటితీపునించు క్రొ
క్కాఱు మెరుంగులై సుగుణ
    కందములై సువిపంచి గీతికా
పూరములై భవత్ప్రణయ
    పూరము లింకనివై చెలంగుతన్.

అనుచు దీవించి దాఁచిన యాత్మమణికి
రీటమును వెసన్ దెప్పించి ప్రేమ తొణఁకఁ
జోళదేవుని వినయసంసూచకాన
తామలోజ్జ్వలమూర్ధమ్మునందు నిలిపి.

రాజరాజమహేంద్ర సామ్రాజ్యలక్ష్మి
నీ యుమాదివ్య లక్ష్మి నర్పించుచుంటి
నేలుకొనుమోయి! నీకీర్తి యినుమడింపఁ
బ్రజలు నిను గాంచి మారాజరాజె యనఁగ.

అనుచు దీవించుచుండ, స్వర్ణాంగుళీయ
కమును గనుసన్నఁదెప్పించి యుమయు దాని
విజయచేతికి నిడి సోముప్రేలఁ దొడఁగఁ
జేసి, రత్నకిరీటమ్ముఁ జేత నెత్తి.

సోమదేవుని నతమూర్ధ సీమ నిలిపి
ఈకళింగ విజయలక్ష్మి నీసమస్త
రాజ్యలక్ష్మి మాదువిజయా లక్ష్మితోడ
నర్పణ మొనర్తు నేలుకోవయ్య నీవు.

అని విజయాకరమ్ముఁగొని యాతని హస్తమునందునుంచఁగన్
గణగణ మంగళప్రదనినాదము లకుతలోక్కమారుగాఁ
బెనుజడిపూలె రేగ సుకవీంద్రులు తద్రసభవ్య దృశ్యముల్
మనములకెక్కియాశిషములన్ దనియించిరి మెచ్చ సద్ద్విజుల్.

సావకాశమ్ముగా వారి చరితలెల్ల
నాలకించి జనావళి యాత్మఁ దలఁచె
బహుళ విపదంధకార ప్రభాతమయ్యె
నేఁటి కాలోకబాంధవనృపుల కంచు.

ఆ రాజన్యుల నిశ్చలప్రణయసీరాంకోరుగాథాళి నో
రూరన్ జెప్పుచునూర్మిహస్తముల మోయున్ గౌతమీదేవి త
త్పారావార కృపాకరశ్వశుర దివ్యావాసమున్ జేర్చుసం
భారమ్మట్లు తెనుంగునాటి నడిత్రోవన్ నాఁటికిన్ నేఁటికిన్.

సంపూర్ణము.





Ananda Press, Madras.

శ్రీ

శారదా పీఠము

శ్రీ అమ్మిశెట్టి లక్ష్మయ్య

కృతులు

నందకిశోర

కల్యాణకళికలు

తారావళి

కల్యాణగీతాంజలి

కల్యాణమధుకణాలు

ప్రణయాపరాధి

ప్రణయమాల

పూజాంజలి

అనామిక

ప్రభాతము

చంద్రగిరిదుర్గము

రైతుకావ్యము

